## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034663

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

బాలానంద బొమ్మల

# జయప్రకాష్ నారాయణ్

రచన:

మలయశ్రీ

రవీంద్ర పబ్లిషింగ్ హౌస్

ఏలూరు రోడ్, అరండల్‌పేట,

విజయవాడ - 520 002.

# విషయసూచిక



"భారత స్వేచ్ఛా సుస్థిరతలను భంగపరచే దోషాన్ని నాపై ఆరోపించడం హాస్యాస్పదం. బానిసలకు తమ సంకెళ్ళను కాపాడుకోవాల్సిన బాధ్యతలేదు జ్ఞాపకముంచుకోండి. ఆ బంధనాలను ఛేదించుకోవడమే వారి కర్తవ్యం. మనం ప్రజాస్వామ్యాన్ని చక్కగా అమలుపరచుకొన్నప్పుడే, మన దేశాన్ని యెంత చక్కగా సంరక్షించుకుంటున్నామో ప్రపంచం గమనిస్తుంది.

"జైలునుంచే స్వరాజ్యం వచ్చింది. జైలునుంచే మీకు అధికారాలు ప్రాప్తిస్తాయి. ప్రజలకు హక్కులు లభించడమేకాక మంచి స్వచ్ఛమైన స్వాతంత్ర్యం కూడా సిద్ధిస్తుంధి.

"మనం సరిక్రొత్త రకపు గ్రామాలనూ, నగరాలనూ నిర్మించుకోవాలి. నూతన జీవితాలను, సంస్కృతినీ, రూపొందించుకోవాలి. పీడన, దోపిడి, ఆకలి, దరిద్రంలేని నవభారతదేశాన్ని ఏర్పరచుకొన్నప్పుడే ప్రపంచంలో మనకు గౌరవం లభిస్తుంది.

అదే దేశ కల్యాణమార్గం" — జె. పి.

"మహాత్మాగాంధి తమ వీలునామాలో నేననుకున్నట్లే అన్నారు. కాంగ్రెసు పేరు నశించుతున్నది. దాని గౌరవం లోపించుతున్నది. త్యాగ తపో దీక్షలతో మెదిలే సత్యసంధులు దానికి వ్యథ చెందుతున్నారు. కాంగ్రెసు రాజకీయాలతో వేరు చేయండన్నారు గాంధీజీ బాధతో. ఎన్నికల్లో చేర్చి దాన్ని దుర్వినియోగ పరచకండన్నారు. మరణ సమయంలో వారిదే మాటన్నారు. ఇంకా నాకంటే ఒక్కడుగు ముందుకే వెళ్ళారు. కాంగ్రెసును భంగపరిస్తే దేశంలో ఏర్పడే హానికరమైన శూన్యతను-అసంతృప్తిని 'దేశ సేవా సంఘాలు'గా రూపొంది, కాంగ్రెసు వికాసం పొందవచ్చునని సూచించారు.

కాని గాంధీగారి ఈ చివరిమాటయినా అంగీకరించబడలేదు.

ఇప్పుడున్న కాంగ్రెసు పూర్వపు కాంగ్రెసు కాదనేది స్పష్టం. దీనిలో ఈనాడు రకరకాల మలినాలు వ్యాపించుతున్నాయి. అందుకే కాంగ్రెసులో మేముంటే దేశానికి శుభంజరిగేదీ లేదని భావించాం. వేరుపడి కాంగ్రెసు దోషాలను ప్రజలముంచుదాం. ఒక క్రొత్త సమాజాన్ని రూపొందించుకునేందుకు ఆందోళన సాగిద్దాం—"

—జయప్రకాశ్

# దేశ స్వాతంత్ర్యానికి ముందు

'జాతిపిత' మహాత్మాగాంధీకి—

"ఇది నిజం కొన్ని ఆలోచనారంగాల్లో నేను పూర్తిగా మీకు సన్నిహితుడనయ్యాను. అది నాకు చాల ఆనందాయకం. అలాగే కొన్ని మౌలిక సిద్ధాంతాలలో ఈనాటికీ నేను అంతే దూరంలో ఉన్నందుకు విచారిస్తున్నాను. అది యెప్పుడూ వున్నదే. కాని, కార్యరంగంలోనయితే నా మార్గం మీకు దూరం మాత్రమేకాదు-సదా వేరుగానూ వుంటున్నది. ఇటు ఎన్ని సంఘటనలు జరిగాయో ఆ కారణంగా నేను అధిక వేగాన్నే పుంజుకున్నాను.

మీరు వ్రాసినట్లు జైలులోపలి-బయటి ఆలోచనల్లో సాధారణంగా భేదం వుండనే వుంటుంది.

ఈ జైలు, మనుష్యులుండగల స్థానంకాదు. అయినా నేను నా విడుదల దినం కోసం, రోజులు లెక్కపెడుతూ లేనని, ఒక మహాయజ్ఞం చేస్తున్నట్లు భావిస్తున్నట్లుగా విశ్వసనీయంగా చెప్తున్నాను.

క్రాంతికారుల్లో కొందరు మరణించడం. కొందరు సర్వస్వం కోల్పోవడం, కొందరు కారాగారాల్లో క్రుగ్గిపోవడం జరుగుతూనే వుంటుంది..."

—జయప్రకాశ్ నారాయణ్.

# స్వాతంత్ర్యం తర్వాత...

ప్రధాని ఇందిరా గాంధీకి—

"దేశంకంటే ప్రజాస్వామ్యం గొప్పదికాదని మీరన్నారు. ఇది మీ అధిక ప్రసంగంకాదా? మీరొక్కరే దేశాన్ని గూర్చి పట్టింపుగల వ్యక్తిగా అనుకుంటున్నారా? మీరు జైల్లో బంధించిన వ్యక్తుల్లో అనేకులు మీకంటే అధికంగా దేశం కోసం శ్రమించారు-త్యాగాలు చేశారు. వారిలో ప్రతిఒక్కరూ మీవలె స్వచ్ఛమైన దేశభక్తులు. అందుచేత రాష్ట్రి సంబంధంలో ఇలాంటి వ్యాఖ్యానాలు చేస్తూ మా గాయాలపై మరింత ఉప్పు చిలకరించకండి...

26 నవంబర్ 1949నాడు నూతన రాజ్యాంగాన్ని నిర్మించుకొన్నాం. 25 ఏండ్ల తర్వాతకూడా న్యాయం, సమానత్వం, స్వాతంత్ర్యం, సౌభ్రాత్రం-పౌరులకు లభించలేదు. దాని దోషం రాజ్యాంగానిదో, ప్రజాతంత్రానిదో కాదు; ఇన్నేండ్లు ఢిల్లీ గద్దెపై అధికారంలో కూర్చున్న కాంగ్రెసు పార్టీదే ఆ దోషం.

ఆ కారణంవల్లనే నవయువకుల్లో అసంతృప్తి వ్యాపించింది. అణచివేత దీనికి విరుగుడుకాదు. దానితో అసంతృప్తి ఇంకా అధికమౌతుంది. పేదల పరిస్థితి దినదినం దిగజారిపోతున్నది. మీరు మీ సమస్త రాజకీయ, మరియు ఆర్థిక విధానాలను మార్చుకోవలసి వుంది"

— లోకనాయక్

# లోకనాయక్
# జయప్రకాశ్ నారాయణ్

## జననం

బాబూ హరసూదయాళ్, ఫూలరాణి, కాయస్థ దంపతులకు విజయ దశమి పర్వదినాన తేది-11 అక్టోబర్ 1902 నాడు జయప్రకాశ్‌నారాయణ్ జన్మించాడు. ఆ తల్లి దండ్రుల ఆనందానికి అంతులేదు. మద్దెల మోతలతో, ఆనంద గీతాలతో వారిల్లు మార్రోగిపోయింది కొన్ని రోజులు.

గుండ్రని తెల్లని ముఖం, నల్లని ఉంగరాల ఒత్తయిన వెంట్రుకలు, విశాలమయిన నుదురు, ప్రకాశవంతమయిన నేత్రాలతో ఆ శిశువు ఎంతో అందముగా ఉన్నాడు. వయసు పెరిగినకొలది ఆ బాబు అందం పెరుగుతూ కన్నవారి ఆనందాన్ని ఇనుమడింపజేశాడు.

నవ్వు ముఖంతో ఎప్పుడూ ప్రసన్నంగా కన్పించేవాడే కాని ఏనాడూ ఏడ్వలేదు-మంచం పైనుండి దొరలి క్రిందపడిన కూడా. బాబు మూగవాడవుతాడేమోనని తల్లి ఫూలరాణి భయపడసాగింది. తండ్రి కూడా బాధపడ్డాడు. మూగ

కాదు-యోగ సమాధిలో ఉన్నట్లుంది పాప పరిస్థితి. అది చూసి 'ముసలయ్యా' అని పిలిచేది తల్లి. అదే బాబును అందరు పిలిచే ముద్దుల పేరయ్యింది.



## ప్రాథమిక విద్యాభ్యాసం

అయిదేండ్లు రాగానే బాబును బడికి పంపించారు. అన్నాళ్ళు నిద్రించి ఉన్న అతని బుద్ధి వికసించసాగింది. చదువులోని ఆసక్తి బాలుని చురుకుదనాన్ని

బహిర్గత పరిచింది. ఒకనాడు జయప్రకాశ్ విద్యాగురువు వారింటికి వచ్చి ఇలా ప్రశంసించాడు.

"ఈ బాబు విద్యలో తప్పక పేరు గడిస్తాడు. ఏ విషయమైనా చాలు ఒకసారి వింటే అతనికి కంఠస్థమైపోతుంది. ఒకసారి అతని పలకమీద వ్రాస్తేచాలు ఇక అది అతని మెదడులో నిలిచిపోతుంది. ఇంత చురుకయిన బుద్ధి- శ్రద్ధకల అబ్బాయిని నేనింతవరకు చూడలేదు. ఇతన్ని 'మూగ- ముసలయ్య' అనేదెవరు?"

ఆ తల్లి దండ్రులకు గురువు మాటలు అమిత ఆనందాన్ని కలిగించాయి. ఊరి వారందరూ జయప్రకాశ్ చురుకుతనాన్ని గూర్చి క్రొత్తగా చెప్పుకోసాగారు.

## జన్మస్థలం - పూర్వీకులు

ఉత్తరప్రదేశ్ బీహార్ రాష్ట్రాల సరిహద్దులు కలిసేచోట 'దియారా' అనే ప్రదేశం వుంది. దాని నాలుగుప్రక్కలా నీరే వ్యాపించి ఉంది. అక్కడి జనాభా 25-30 వేల మధ్య ఉంది. అందులోని ఒక పల్లెటూరు లాలాటోలీ. అక్కడ కాయస్థులెక్కువ.

బాబూ దేవకీనందనలాల్‌ది ఆ పల్లెలో పేరున్న కుటుంబం. ఆయన పోలీస్ 'దారోగా' ఉద్యోగం చేసేవాడు. ఠీవిగా గుర్రంపై కూర్చుని స్వారీచేస్తూ పోతుంటే గ్రామస్థులందరూ గౌరవంతో ప్రక్కకు తప్పుకొని దారి వదిలేవారు.

ఆయనకు వయసు మళ్ళిన దశలో కలిగిన ఏకైక పుత్రుడు హరిసూదయాల్. యోగ్యుడైన తండ్రి శిక్షణలో అల్లారుముద్దుగా పెరిగిన అతడు యెలా

ఉత్తముడు కాకుండా ఉంటాడు? నీటి పారుదల శాఖలో ఉద్యోగం ఆరంభించిన హరసూదయాల్ తన నిజాయితీ దీక్షలవల్ల జిల్లా అధికారి, రెవెన్యూ ఆఫీసర్ పదవులు చేపట్టాడు. పేరు-డబ్బు పుష్కలంగా సంపాదించాడు. అయినా గర్వం లేదు. దయ సౌజన్యం ఆయన సొత్తు. మాట-మనసు మెత్తన. అన్ని విధాలా ఆయనకు తగిన ఇల్లాలు ఫూలరాణి. ఆ పుణ్యదంపతుల నోముల పంట మన ముద్దుల మూగ ముసలయ్య, జైప్రకాశ్ నారాయణ్!

## ఉన్నత విద్య

దియారాలో ఆకాలంలో ఒక మాధ్యమిక పాఠశాల మాత్రమే ఉండేది. తండ్రి ఉద్యోగ కారణంగా ఊళ్ళు తిరుగుతూ ఉన్నందున జయప్రకాశ్ చదువు స్థిరంగా సాగలేదు. ఎలాగోలాగు ప్రాథమిక విద్య పూర్తయింది.

తర్వాత ఉన్నత విద్యకోసం పాట్నా పంపించారు. బంధువుల యింట భోజన భాజన వసతి సమకూర్చారు. కలిగిన వాళ్ళకు చుట్టాల కలుపుగోలుతనానికి, సహకారానికి కొదువేముంటుంది. అబ్బాయి చదువులో శ్రద్ధగా లీనమయ్యాడు.

ఆ కాలంలో పాట్నా నగరం ఇప్పటివలె విశాలమైన తారు రోడ్లతో పెద్ద పెద్ద భవనాలతో అధునాతనంగా లేదు. మామూలు కంకర రోడ్లపై గుర్రపు బగ్గీలు గర గర శబ్దం చేస్తూ పోతుండేవి.

పాట్నా కాలేజెట్ స్కూల్‌లో ఏడవతరగతిలో ప్రకాశ్‌కు ప్రవేశం లభించింది. ఆ విద్యాలయ అధ్యక్షుడు అమ్జత్ ఆలీఖాన్ సభ్యుడు, సంస్కార

సంపన్నుడు. ఆయన పర్యవేక్షణలో జయప్రకాశ్ చదువు చక్కగా సాగింది. విద్యార్జనలోనే లీనమై క్రమంగా మేధావిగా రూపొందసాగాడు. ఇతర విషయాల పైకి అతని ధ్యాస వెళ్ళేదికాదు.

తర్వాత అతని మకాం 'సరస్వతీభవన్' హాస్టల్‌కి మారింది. అక్కడే ఎందరో రాజనీతిజ్ఞులు శిక్షణ పొందారు. ఉత్సాహవంతులు మేధావులు అయిన విద్యార్థులకు అది నిలయం. బీహార్ కేసరిబాబూ రోజూ అక్కడికి వస్తుండేవాడు. అనేక రాజకీయ విషయాల చర్చలు సాగేవి. గప్‌చుప్‌గా ఆ వాదనలన్నీ వింటుండే వాడు జయప్రకాశ్. అప్పుడు తాను వాచాలత్వం చూపకున్నా క్రమంగా ఆయన మనస్సు మాత్రం దేశభక్తితో నిండిపోసాగింది.

ఆయన అభిరుచి మారింది. కేవలం పుస్తకాల పఠనతోనే సంతృప్తి చెందక వార్తాపత్రికలు చదివి దేశ రాజకీయ సామాజిక విషయాలు గ్రహించడంలో నిమగ్న మయ్యేవాడు.

పాఠశాల గ్రంథాలయంనుండి మంచి పుస్తకాలు తీసుకొని చదివేవాడు. క్రమంగా జయప్రకాశ్ మేధస్సుతోపాటు వ్యక్తిత్వం కూడా పెంపొంద సాగింది. అప్పుడతని వయస్సు కేవలం పదహారు.

## సోదరి వివాహం - బావతో స్నేహం

జయప్రకాశ్ సరస్వతీ భవన్‌లో వుండి విద్యాభ్యాసం చేస్తున్న కాలం లోనే ఆయన పెద్దక్క చంద్రావతి వివాహం అయింది. వరుడు ప్రణ బిహారీబాబు పాట్నా హైకోర్టు ఆఫీసు ఉద్యోగి. ఆయన శాంతస్వభావం కల సద్గుణ వంతుడు.

నియమ నిష్ఠా సంపన్నుడు. జయప్రకాశ్ హాస్టల్ వదలి అక్కగారింటిలో వుండ సాగాడు. బావగారి పర్యవేక్షణలో ఆయన శీలం మరీ సంస్కారవంతమైనది. యద్యదాచరతి శ్రేష్ఠఃతత్తదేవేతరో జనః, అన్నట్లు పెద్దల ప్రభావం పిన్నవారిపై తప్పక ప్రసరిస్తుంది.

వ్రజ బిహారీ ఇల్లు బడికి చాలదూరం. పగలు భోజనానికి వచ్చే వీలుండేది కాదు. రోజుకు మూడణాలు జయప్రకాశ్ ఖర్చుకోసం లభించేవి - ఇంట్లో ఇచ్చే వారు. ఒక రూపాయికి పదహారు అణాలు, అణాకు ఆరు పైసలు. అప్పటి లెక్క అది. రెండణాలు పోను రానూ జట్కా ఖర్చు. మిగిలిన అణాలో టిఫిన్ కాఫీ హోటల్లో తీసుకునేవాడు. ఇప్పుడు డబ్బు విలువ తరిగి వస్తువు విలువ పెరిగింది. వస్తువుల ఉత్పత్తి తరిగి, వాడకం పెరిగినప్పుడు ఇలాంటి మార్పులు తప్పవు మరి.

ఇంట్లో అక్కయ్య లేని సందర్భంలో బావ వంటచేసే సందర్భాల్లో ఆయనకు సహకరిస్తూ క్రమంగా జయప్రకాశ్‌కు వంటచేయడం వచ్చింది. అది భావి జీవితంలో ఎంతగానో వుపయోగపడింది. అది స్త్రీలు చేసే పని, పురుషులు వంట చేయడం తప్పు—అని భావించడం పొరపాటు!

## గీతా భక్తుడయ్యాడు

భారతీయ జన జీవితంలో వేదధర్మం (హిందూ మతం) గంగ జీవనది లాంటిది. చార్వాక, జైన, బౌద్ధ, ఇస్లామి, క్రైస్తవం, ఇలా ఎన్ని స్వదేశ, విదేశ

మతాలు వచ్చినా అది ఎన్నో మార్పులకు లోనవుతూ అవిచ్ఛిన్నంగా ముందుకు సాగిపోతూనే వుంది.

పౌరాణిక మతాల్లో శైవం, వైష్ణవం ప్రముఖమైనవి. ఆత్మవాదం ఉపనిషత్తులలోనిది. ఆధ్యాత్మికం (ఆత్మ గొప్పదనే భావం) విద్యావంతుల్లోనే వ్యాప్తి. అయినా జనసామాన్యం చిల్లర దేవతలతోపాటు పౌరాణిక దేవతలనూ గౌరవించేవారు. బ్రాహ్మలు, ధన సంపన్నులు వేద ధర్మాలను, యజ్ఞయాగాలను అభిమానించేవారు.

మహాభారత యుద్ధరంగంలో శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించినట్లుగా వ్యాసుడు వ్రాసిన భగవద్గీత పఠన ఆరాధన హిందువులలో అధికం. అది వైదిక, ఉపనిషత్తుల ధర్మాలకు పట్టం కట్టింది. ఒక పవిత్ర గ్రంథంగా పేరుపొందింది.

రాహుల్ సాంకృత్యాయన్ అభిప్రాయం ప్రకారం-గీత, కొత్త సీసాలో పాత సారాయి లాంటిది! అయినా అందులో యెన్నో మంచి నీతులున్నాయి. ముఖ్యంగా మన భారం భగవంతునిపై వేసి ఆశారహితంగా పనులు చేయమని ప్రబోధిస్తుంది భగవద్గీత.

కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన.
(ఫలితాలను కోరకుండా పనులు చేయటమే నీ వంతు)

శంకరాచార్య రామానుజులు వంటి యతులేకాక, తిలక్, గాంధీజీ వంటి రాజకీయ నాయకులు కూడా గీతకు నచ్చిన తమకు వ్యాఖ్యానాలు వ్రాసారు.

బావగారి సంసర్గమనండి, మరే ఇతర కారణంవల్ల కానీండి, జయప్రకాశ్‌కు గీతాభక్తి కుదిరింది. ఉదయమే లేచి స్నానం చేసి గీతను పఠించడం ఆయనకు నిత్యకృత్యం అయింది.

తన పుస్తకాలతోపాటు గీతా పుస్తకం సైతం బడికి తీసుకెళ్ళేవాడు. మధ్యాహ్నం విరామ సమయంలో ఒకటి రెండు శ్లోకాలు మిత్రులకు చదివి విని పించేవాడు-భావం వివరించేవాడు.

## శాంతి-క్రాంతి మధ్య

అప్పుడు మనదేశంలో స్వరాజ్యం సాధనకోసం శాంతి-క్రాంతి రెండు గాలులు తీవ్రంగా వీస్తున్నవి. పాట్నాలోనూ అంతే.

కలకత్తానుంచి గంగా జలమార్గాలున్న ప్రధాన నగరం పాట్నా, బెంగాల్ తీవ్రవాద ప్రభావం పాట్నాపై కూడా ప్రసరించసాగింది. 1909 అరవిందఘోషు అలీపూరు కుట్రకేసు, 1915లోని జతీంద్రనాథ్ విప్లవ కార్యక్రమాలు, మొత్తం. దేశాన్నే సంచలన పరచినవి. యువకులు ఆయుధ చర్య ద్వారానే సత్వర స్వరాజ్య సాధన లక్ష్యంగా పెట్టుకున్నారు. "బ్రిటిష్ వాళ్ళను కాల్చివేసి బస్తాల్లో నింపండి" అని జెనీవానుంచి మేడం కామా 'వందేమాతరం' పత్రికలలో వేసిన హెచ్చరిక వారికి ఆదర్శమయింది. దానికి బెంగాల్, పంజాబ్, మహారాష్ట్ర, తమిళనాడు సంసిద్ధపడినవి. బీహార్ ఎలా ఊరుకుంటుంది. పాట్నాలోనూ విప్లవకారుల రహస్య సంఘం ఒకటి పని చేయసాగింది.

దేశంలో మొట్టమొదటి బాంబు ప్రేలుడు, మొదటి దోపిడీ రాజకీయ పరంగా బీహారులోనే జరిగాయి. ఖుదీరాం బోసు ముజఫర్‌పూర్‌లో గుర్రపు బండిపై బాంబువేసి I. A. S. కింగ్స్‌ఫర్డ్ ఇంటి ముందు ఇద్దరు ఆంగ్ల స్త్రీలను చంపాడు. శాహాబాద్‌లో అర్జున్‌లాల్ సేథీ దొంగతనం చేశాడు.

యువతరం విప్లవోద్రేకంతో ఊగిపోతోంది.

మరోవైపు గోఖలే గాంధీజీల కాంగ్రెసు శాంతి సత్యాగ్రహ ప్రచారం. ఈ రెండు భావాల ప్రభావాలు జయప్రకాశ్‌పై తీవ్రంగానే పడినై. శాంతి-క్రాంతి రెంటిలో తన మార్గం ఎటు అనేది త్వరగా తేల్చుకోలేకపోయాడు.

ఆ కాలంలోనే గాంధీజీ చంపారణ్‌లో అహింసా పోరాటాన్ని గూర్చి ప్రచారం చేసి వెళ్ళాడు. ఆ ప్రసంగం జయప్రకాశ్ విన్నాడు. గాంధీ మాటల ప్రభావం అతనిపై బాగా పడింది. నాజూకైన తెల్లని దుస్తులు, మెరిసే పాదరక్షలు వదలివేసి, మోకాళ్ళవరకు ముతకధోతీ, మందపు చొక్కా, తోలు చెప్పులు ధరించ సాగాడు జయప్రకాశ్. గోఖలే వ్యక్తిత్వానికి, గాంధీ నిరాడంబరతకు ముగ్ధుడై వారి అభిమానిగా మారిపోయాడు.

## కళ్యాణ మయ్యింది

అన్ని విధాలా తగిన జోడీలు కుదరవు. అలా తగిన జంట ఏర్పడినా ఎక్కువకాలం బ్రతకరు అని లోకంలో సాధారణంగా అంటారు. కాని అది తప్పని ప్రభావతీ జయప్రకాశ్‌లు నిరూపించారు.

బీహారు కాంగ్రెసు నాయకుల్లో ప్రముఖ వ్యక్తి బాబూ వ్రజకిశోర్. ఆయన కూతురుతో జయప్రకాశ్ వివాహం జరిగింది.

ఒకనాడు జయప్రకాశ్ తమ పినతండ్రి శంభూబాబుతో కల్సి జాతీయ నాయకుడైన డా॥ రాజేంద్రప్రసాద్ శిబిరానికి వెళ్ళాడు. అక్కడే వ్రజకిశోర్ బాబు జయప్రకాశ్ రూపాన్ని, వ్యక్తిత్వాన్ని, ఆదర్శాన్ని చూసి ముగ్ధుడై అల్లునిగా చేసుకోవాలనుకున్నాడు.



ప్రభావతి అతని ముద్దుల కూతురు. కొడుకులతోపాటు మగపిల్లవాడు వలెనే ఆమెను గారాబంగా పెంచాడు. జాలంధర్ కన్యా విద్యాలయంలో చదువు తున్నది. అంతా పదునాలుగేండ్ల ప్రాయం. అష్టవర్షాత్ భవేత్కన్యా-అని యుక్త

వయస్సు రాకముందే కూతుళ్ళకు పెళ్ళిళ్ళుచేసే కాలమది. పురాణాల్లో యువతులకు కళ్యాణాలు జరిగినట్లు సాక్ష్యమున్నా, ఇతిహాస కాలపు సీతారాముల వివాహ సందర్భంలో రాముని వయస్సు పదునాలుగు, సీతకు ఏడేండ్లట. భారతంలో సత్యవతి, కుంతి, హిడింబి, ద్రౌపది, సుభద్ర, ఉత్తర, శశిరేఖలవి యువ వివాహాలే !

పూలరాణి, హరసూదయాల్ ఆ వార్తవిని ఆనందంతో తల మునకలయ్యారు. అంత గొప్పవ్యక్తి కూతురు, సుగుణాల-సౌందర్యాల రాశి తమకు కోడలుగా వస్తుందని ఆ సంతోషం, ఎంత డబ్బు ఇస్తున్నారనేది ఈనాటి ఆచారమయింది. డబ్బు కాదు కుటుంబ గౌరవం ముఖ్యం అనుకునేవారు నాడు.

వైభవంగా కల్యాణం జరిగింది. నవవధువు ప్రభావతితోపాటు వరుడు జయప్రకాశ్ శ్రీనగర్‌నుంచి బంధు మిత్రులతోపాటు దియారాకు వచ్చాడు. వరుని సుందర రూపం సుగుణ సంపదకు అత్తింటి బంధువులు ముగ్ధులైనారు. కోడలిని గృహలక్ష్మిగా భావించారు వరునింటివాళ్ళు.

వ్రజకిశోర్ 1921-32లో బీహార్ కాంగ్రెసులో ఘనంగా పని చేశాడు. గాంధీని మొదటిసారిగా చంపారణ్‌కు ప్రసంగానికి ఆహ్వానించింది అతడే. ఆయన శిష్యరికంలో ఎదిగిన వ్యక్తి రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్. ఇక సొంత అల్లుడు జయప్రకాశ్ ఆయనవల్ల స్ఫూర్తి పొందడంలో అసంగత మేముంటుంది.

అదే సందర్భంలో కలకత్తానుంచి పాట్నాకు నివాసం మార్చి రాజేంద్రప్రసాద్ హైకోర్టు లాయర్‌గా రాణించ సాగాడు. రాజకీయాలు వదలుకోలేదు. ఆయన ప్రభావం జయప్రకాశ్‌పై చక్కగా ప్రసరించింది.

పైగా డా॥ రాజేంద్రబాబు పెద్దకొడుకు మృత్యుంజయ ప్రసాద్‌కు ప్రభావతి చెల్లెలుతో పెళ్ళయింది. ఈ బంధుత్వం వారిని మరింత దగ్గర చేసింది.

తండ్రి ప్రభావంవల్ల రాజకీయాల ఆసక్తి సేవా పరాయణ కల ప్రభావతి, భర్త సౌజన్యం, సాదాజీవితం, ఉన్నత వ్యక్తిత్వం, దేశభక్తిచూసి ఆనందించింది. తానూ పతి అడుగుజాడల్లో నడవసాగింది.

అందుకే వారు ఆదర్శ దంపతులు కాగలిగారు.

వివాహో విద్యనాశాయ-అనే సూక్తికూడా ఆయనపట్ల అసత్యమే అయింది.

## విద్యార్జనకు - విదేశాల ప్రయాణం

గాంధీజీ 1921 సత్యాగ్రహంలో ప్రవేశించిన వెంటనే, జయప్రకాశ్ సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళడానికి పయనమయ్యాడు. మామకు అది ఇష్టంలేక అడ్డు చెప్పటంతో ఆగిపోయాడు. రాజకీయాలు తనకెంత ఆసక్తిగా ఉన్నా, నవ యువకుడు సంసారాన్ని వదలి బైరాగిగా వెళ్ళి సత్యాగ్రహ ఉద్యమంలో చేరి పోవడం వ్రజకిశోర్‌బాబుకు నచ్చలేదు. అది గొప్ప విషయమే అయినా కూతురు విషయం తన ఆదర్శానికి అడ్డు నిలిచింది.

డా॥ రాజేంద్రప్రసాద్ ప్రధాన ఆచార్యకత్వంలో నడుస్తున్న బీహారీ విద్యాపీఠంలో జయప్రకాశ్ ఇంటర్‌మీడియెట్ విజ్ఞానశాస్త్రంలో ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. బి. ఎస్సి. చదువుకోసం వారణాసి వెళ్ళాడు. పాట్నాలో లేదు.

ప్రొఫెసర్ ఫూల్‌దేవ్ సాహెబుతో కల్సి ఉంటూ చదువుతోపాటు సైన్సు పరిశోధనా రంగంలో పాల్గొనేవాడు.

సహాయ నిరాకరణ సందర్భంలో గాంధీజీ పిలుపువల్ల దేశంలోని అనేక విద్యార్థులవలె తానూ కాలేజీ వదిలాడు. ఉద్యమం నిలిచిపోయినతర్వాత 1922లో హిందూ కాలేజీలో చేరి డిగ్రీ పూర్తి చేయమని గురువులు ప్రోత్సహించారు. కాని అతనికది రుచించలేదు. నిన్న మొన్నటివరకు ఆంగ్ల ప్రభుత్వాన్ని దుయ్యబడుతూ తిరిగి, మళ్ళీ ఆ ప్రభుత్వ సహాయంతో నడుపబడుతున్న ఏ విద్యాసంస్థలోనైనా చదవటం భావ్యంగా కనిపించలేదు. తమ అనుకూలతనుబట్టి సిద్ధాంతాలను మార్చుకునేందుకు సుముఖంగా లేదు జయప్రకాశ్.

అంతకుముందు బీహార్‌లో స్వామీ సత్యదేవ్ మాటల ప్రభావం వల్ల అతనికి అమెరికాపై ఆసక్తి ఏర్పడింది. అక్కడికే వెళ్ళి చదువుకోవాలనే నిర్ణయానికి వచ్చాడు.



అదే సందర్భంలో గఢ్‌వాలీ విద్యార్థి బోలాదత్తు హిందూ విశ్వ విద్యాలయంలో చదువుకునేవాడు అమెరికా వెళ్ళి విద్యాధ్యయనం కావించాలనుకున్నాడు, సహాయం కోసం ఒకనాడు అతడు వ్రజకిశోరీలాల్ ఇంటికి వచ్చాడు. మామగారికంటే ముందు అల్లునితోనే పరిచయం కలిగి, మాటలు కలిసి ఇద్దరు మిత్రులైనారు. ఇద్దరి కోరికలు ఒకటే కాబట్టి దోస్తీ పెరిగింది. ఆయన ఆశించిన ప్రకారం సహాయం లభించి అమెరికా వెళ్ళి మిత్రుడికి లేఖ వ్రాసాడు.



"మీరు మీకిష్టమైనప్పుడు రావచ్చును, అమెరికాలో విద్యార్జనకు అనుకూలంగా వుంటుంది. ఎలాంటి ఇబ్బందీ కలగదు."

ఆ మాటలు జయప్రకాశ్ ఉత్సాహాన్ని పెంచినై.

రహస్యంగా ఆ ఉత్తరాన్ని భార్యకు చూపాడు, కలకత్తా వెళ్ళి పాస్‌పోర్టు తీసుకొని వచ్చాడు. వెళ్ళే తేదీని ప్రభావతికి మాత్రం తెలిపాడు. అప్పుడతని వయస్సు 20. ప్రభావతి వయస్సు 16 సంవత్సరాలు.

"మీకు అక్కడే చదువుకోవాలని వుంటే మీ కోరికకు నేను అడ్డురాను" అంది ఆమె భర్తతో.

"నేను త్వరలోనే తిరిగివస్తాను భయపడకు, నువ్వు కూడ ఇక్కడ అంత వరకు చదువుకో. రాట్నం వడుకు. ప్రతిరోజు గీతా పఠనం కావించు" ఇదీ జవ్వని అయిన భార్యకు యువకుడు జయప్రకాశ్ ఇచ్చిన ఆదేశం,

ఆయనటు అమెరికాకు ప్రయాణం కాగానే ప్రభావతి ఇటు గాంధీజీ సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళిపోయింది.

## జపాన్ నచ్చింది

16 మే 1922న కలకత్తా హార్బర్‌నుంచి జెనస్ నౌకలో విదేశాలకు బయల్దేరాడు జయప్రకాశ్. తొలిసారిగా సముద్రప్రయాణం ఎంతో ఆనందదాయకంగా వుంది. మలయా. పినాంగ్, సింగపూర్ మీదుగా చీనాలోని హాంకాంగ్ చేరాడు అక్కడ జపాన్‌లోని కోబే రేవుకు చేర్చింది నౌక.

జపాన్ జయప్రకాశ్‌కు బాగా నచ్చింది.

చిన్న చిన్న పరిశుభ్రమయిన గృహాలు, వాకిళ్ళలో పూలమొక్కలు, మిత అలంకారాలతో సుందరంగా కనిపించే రమణులు, ఉత్సాహవంతులయిన నవ యువకులు అతని మనస్సును ఆకట్టుకున్నారు.

జపాన్ దేశం చిన్నదయినా, విశాలమయిన రష్యానే ఓడించి ప్రమాద కారులయిన ఐరోపా శ్వేతజాతీయులను సిగ్గుపడజేసింది. ప్రభాత సూర్యవందన



ముతో ప్రతిదినం తమ కార్యక్రమాలను ఆరంభించే జపానీయులు కేవలం మేబది సంవత్సరాల్లోనే యెంతగానో ఎదిగి ఉద్యోగ, వ్యాపారాల్లో ప్రపంచ ఖ్యాతి నార్జించారు.

ఆ దేశంవలె భారతదేశాన్ని సుందరంగా. స్వచ్ఛంగా, స్వేచ్ఛగా వుంచుకోగలిగేది యెప్పుడో అనుకున్నాడు.

కోబేనుండి ఒసాకా వెళ్ళాడు. అక్కడ మహదేవ్‌లాల్ శర్ర్యాఫ్ కలిశాడు. ఆయన కూడా పైచదువుల కోసం అమెరికా వెళుతూ డబ్బు సరిపోక కోబేలో జపానీ పత్రికల ప్రూఫులు దిద్దుతూ గడుపుతున్నాడు.

ఒకాసానుంచి జయప్రకాశ్ ట్రైన్‌లో యోకోహామా వెళ్ళాడు. అక్కడి నుంచే 'తైయో మారూ' స్టీమర్‌లో అమెరికా ప్రయాణం సాగించాడు. సుందర మయిన జపాన్‌లో వారంరోజులు గడిపాడు. అది అతనికి అందమయిన అనుభవం మరపురాని మధుర స్మృతి!

## అమెరికాలో

విశాల పసిఫిక్ మహాసముద్రంలో పయనిస్తూ అమెరికా చేరువ అవుతున్న కొలదీ యెంతగానో ఆనందించాడు.

మార్గంలో హవాయి ద్వీపంలో నౌక ఆగింది. అక్కడి ఎమోనాకీ పర్వతం హిమాలయాలకంటే ఉన్నతమైనదయినా అడుగు భాగం సముద్రజలములో మునిగి వుండటంచేత ఎవరెస్టు రికార్డును మించలేదట. ఆ సుందర ప్రకృతి మధ్య ఒక దినం గడిపాడు. పద్దెనిమిదో రోజున శాన్ ఫ్రాన్సిస్కో చేరాడు.

టాక్సీ ద్వారా ఒక హబ్సీహోటల్‌కు వెళ్ళాడు. అక్కడి పేదరికపు వాతావరణం ప్రకాశ్ మనస్సును కలచివేసింది.

అక్కడినుండి ఇతర భారతీయ విద్యార్థులున్న 'నలందా క్లబ్'కు నివాసం మార్చి భారతదేశంలో వున్నంత సంతృప్తిని పొందాడు. అక్కడ కె. బి. మీనన్ తోడుగా వున్నాడు. క్యాలిఫోర్నియా యూనివర్సిటీలో చేరాడు.

సముద్రం ప్రక్కన సువిశాల స్థలంలో గొప్పమేడల్లో ఆ విశ్వవిద్యాలయం వుంది. అక్కడి ఆచార్యులు బాగా చదివినవాళ్ళు, బోధనలో నేర్పరులు. ఆ వాతావరణం అతనికి నచ్చింది. కాని అక్కడి ఫీజు మాత్రం భారంగా వుంది. ధనవంతులకు బాధలేదుకాని జయప్రకాశ్‌కు దాన్ని భరించడం కష్టమే. ఒక టర్మ్ కాలం చదివాడక్కడ.

భోలానందదత్తు చదువుకుంటున్న ఇయోవా యూనివర్శిటీలో చేరాడు. ఆ తర్వాత, అక్కడ ఫీజులు తక్కువ. డా॥సుధీంద్రబోస్ అక్కడే ప్రొఫెసర్.

## చదువుకోసం కూలీపని చేశాడు

శ్రద్ధగా చదువుసాగుతున్నది కాని, డబ్బు అవసరం యెక్కువే. తండ్రి ఇచ్చిన డబ్బు అయిపోయింది. మళ్ళీ ఆయనకు వ్రాయాలనిపించలేదు. ఆయన ఆర్థిక పరిస్థితి అంతమాత్రంగానే వుంది. ఇంకా పిల్లలున్నారు. అభిమానం అడ్డు వచ్చి మామను సైతం ఏమీ అడగలేదు.

చదువుపై వున్న ఆసక్తి తిరిగి తన దేశానికి వెళ్ళనీయలేదు. డబ్బు కావాలి. తానే సంపాదించుకోవాలి, అందుకు శారీరక శ్రమే శరణ్యమయింది. విరామ సమయాల్లో కూలీపనికి పూనుకున్నాడు.

ద్రాక్షతోటల్లో పనిచేశాడు. ధనవంతుల ఇండ్లలో సామానులు, పుస్తకాలు మలిపి సర్దిపెట్టేవాడు వాకిళ్ళలో పేరుకుపోయిన మంచుగడ్డలను పెకిలించి దూరం పారవేసేవాడు. హోటళ్ళలో పనిచేశాడు. చివరికి పశువులుకోసి, చర్మాలు ఒలిచి

మాంసాన్ని ముక్కలుచేసి ప్యాక్ చేసి దేశవిదేశాల్లో అమ్మే కసాయి శాలల్లోనూ పనిచేశాడు. మాంసం తినని కాయస్థ బ్రాహ్మణ కుటుంబపు జయప్రకాశ్ కిది ఎంతటి దుర్భర విషయమో గ్రహించవచ్చు. అయినా సహించాడు. అతని విద్యా తృష్ణ అంతటి బలీయమైనది.



కాలిఫోర్నియా వదలి వెళ్ళేముందు ఒకరోజు సిక్కులవద్ద కూలిపని చేసాడు ఛార్జీ డబ్బుకోసం. తర్వాత పండ్ల ప్యాకింగ్ కంపెనీలో పనిచేసి

ఇయోవా వెళ్ళాడు. అక్కడి భారతీయ విద్యార్థులతో కల్సివుంటూ భోలానంద్‌తో కల్సి వంట చేసుకునేవాడు. ఇయోవాలోనే మిగతా పనులన్నీ చేసింది.

అక్కడ ఏడాది గడిచింది. కెమికల్ ఇంజనీరింగ్ చదివాడు. అయితే డ్రాయింగులో తప్పాడు.

ఆ తర్వాత షికాగో వెళ్ళాడు. ఇది అమెరికాలో రెండవ పెద్ద నగరం ఆ కాలంలోనే దీని జనాభా 35 లక్షలు. ఇక్కడే ప్రపంచ సర్వమత మహాసభలో వివేకానందుడు ప్రసంగించి ప్రపంచ ఖ్యాతిని పొందాడు.

ఇక్కడ తీపి, చేదు అనుభవాలు బాగా కలిగాయి. డబ్బుకోసం యెక్కువ శ్రమించవల్సి వచ్చిందీ ఇక్కడే. మాంసం ఫ్యాక్టరీలో, మట్టిపాత్రల బొమ్మల కంపెనీలో పనిచేశాడిక్కడ. లోహ పరిశ్రమలోనూ పరిశ్రమించాడు. అన్నీ తాత్కాలికపువే-పర్మనెంట్ ఉద్యోగాలు కావు. తనకు చదువుసాగడం కోసం కదా ఆ పనులన్నీ. నో వేకెన్సీ బోర్డులు చూస్తూ కాళ్ళరిగేలా తిరిగేవాడు ఒక్కోసారి. ఎందుకొచ్చిన కష్టం, ఏదో నౌకరి చూసుకొని హాయిగా ఇంట్లో వుండక. ఆయన విజ్ఞాన తృష్ణ అలా నిలువనీయలేదు.

ఏటికి ఎదురీదడమే ధీర గుణం.

కన్నీటికి వెత చెందడమే పిరికితనం.

కొన్ని బియ్యం ఉడికించుకుని తిని బజారులో కాఫీ త్రాగి, భోజనం అయిందనిపించుకునేవాడు. ఇంత శ్రమ వున్నా విరామం దొరికినప్పుడు రాకెట్ తీసుకొని లింకన్ పార్క్‌కు వెళ్ళి టెన్నిస్ ఆడివచ్చేవాడు. దానికి ఫీజు లేదు. ఆధునిక నగరాల్లో ప్రతిదీ డబ్బుతో కొనబడుతుంది కదా.

ఇన్ని చేసినా చదువుమీద అశ్రద్ధమాత్రం చూపలేదు.

## మరో యూనివర్సిటీకి మారాడు

క్యాలిఫోర్నియా, ఇయోవా, షికాగోల తర్వాత విస్కాన్సిన్ విశ్వ విద్యాలయానికి వెళ్ళాడు. ఆ రాష్ట్రం అమెరికాలో ప్రగతిశీలమైందిగా చెప్పబడేది. ఆ విద్యాసంస్థకుకూడా మంచి పేరుంది. అక్కడ గ్రాడ్యుయేషన్ పూర్తికాకముందే విజ్ఞానశాస్త్రం నుంచి సామాజిక శాస్త్రానికి మారాడు. అక్కడినుంచి షికాగో వెళ్ళి రష్యావెళ్ళే ప్రయత్నంలో ఉన్నాడు. ఇంతలో ఇండియా నుంచి డా॥ రాజేంద్రప్రసాద్‌గారి లేఖ వచ్చింది. దాని సారాంశం ఇది.

"మీరు అటునుంచే రష్యా వెళ్ళకండి. భారతదేశం రండి. ఒకవేళ మీకు రష్యా వెళ్ళాలని అంత ఇష్టంగాఉంటే ఇక్కడినుంచే అటు వెళ్ళే ఏర్పాటు చేయబడుతుంది."

జయప్రకాశ్ లేఖకిది జవాబు అయి ఉంటుంది. ఆ కోరిక అతని మామగారిది అయివుంటుంది.

రష్యా ప్రయాణం వాయిదా వేసుకుని విస్కాన్సిన్‌కు వెళ్ళి అక్కడి యూనివర్శిటీలో సామాజికశాస్త్ర పఠనం ఆరంభించాడు. ఒక టర్మ్ గడిచే సరికి ఓహ్యో విశ్వవిద్యాలయంలో సీటు దొరికింది. అక్కడ బి.ఎ. పూర్తి చేశాడు. డిస్టింక్షన్‌లో ప్యాసయినందున 30 డాలర్ల మాసవేతనంకూడా లభించింది. ఇతర కూలీ పనికి సలాంకొట్టి లభించే డబ్బునే పొదుపుగా వాడుకోసాగాడు.

ఎం. ఎ.లో చేరిన కొన్ని మాసాలకే అతని యోగ్యత, సచ్ఛీలత గమనించి అదే యూనివర్శిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్ ఉద్యోగం ఇచ్చారు అధికారులు. ఎం. ఎ. చదువుతూనే క్రింది తరగతులకు విద్యాబోధన కావించేవాడు. అందుకు అదనంగా 80 డాలర్లు లభించి, డబ్బు సమస్య తీరిపోయింది.

ఇక పూర్తి సమయాన్ని చదువుమీద కేంద్రీకరించాడు. ఆయనకు ఏ ఒక్క విషయంతోనో సంతృప్తి-స్థిరత లేదు. కొత్తకొత్త విషయాలపై ఆసక్తి పెరిగి తరచు చదువు మార్చుతుండేవాడు.

ఎం.ఎ.లో సోష్యల్ వేరియేషన్ అభిమాన విషయంగా తీసుకున్నాడు. ప్రొఫెసర్ లుమ్‌గేగైడ్, ఆయన థీసిస్ సర్వోత్తమమైందిగా ప్రశంస పొందింది. ఆ తర్వాత పి. హెచ్. డి.కి పూనుకున్నాడు. ఇంక ఒక సంవత్సరమైతే పూర్తి అవుతుందననగా తల్లి ఫూలరాణి అనారోగ్యంగా ఉన్నట్లు తిరిగి రావలసిందిగా లేఖ వచ్చింది. డిగ్రీ పూర్తికాందే వెళ్ళాలని లేదు. కాని అమ్మవైపు మనసు లాగుతుంది— కన్నతల్లి!

ఈ ప్రయాణం సంగతి ముందుగా ఊహించింది కాదు కనుక చదువు, పుస్తకాలు, భోజన వసతి కోసం ఆదాయాన్నంతా వ్యయం చేసాడు. డబ్బుకి సమస్యగానే వుంది.

డబ్బు పంపండి వస్తానని ఇంటికి రాయడానికి మనసొప్పలేదు. న్యూయార్కు చేరి తన రెడ్డి మిత్రునితోపాటు హోటళ్ళలో, ఫ్యాక్టరీలలో పని చేయసాగాడు. అమ్మ జ్ఞాపకం అతనికి అలసట బాపి నూతనోత్సాహాన్ని ఇచ్చేది. ఖర్చులకు సరిపడినంత డబ్బు సమకూరగానే ఇండియాకు ప్రయాణమైనాడు.

## డా॥ రాధాకృష్ణన్‌ను కలశాడు లండన్లో

**1929** సెప్టెంబర్‌లో నౌక అమెరికాను వదిలింది. ఇంగ్లాండులో 28 రోజులు ఆగాడు. ప్రముఖ భారతీయ వేదాంత విద్వాంసుడు డా॥ సర్వేపల్లి రాధా



కృష్ణన్ అప్పుడు ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో ప్రొఫెసర్. ఆ విద్వాంసుని దర్శించి అమితానందం పొందాడు జయప్రకాశ్.

ఇంగ్లాండునుండి ఆస్ట్రేలియా నౌకలో కొలంబో (శ్రీలంక) చేరి

అక్కడినుంచి మరో నౌకలో కలకత్తా చేరాడు. జన్మభూమిని వదలి సరిగా యేడేండ్లయింది.

ఆసక్తిగా అత్తవారింటికి వెళ్ళాడు. ప్రభావతి పాట్నాలో లేదు. గుజరాత్ లోని గాంధి ఆశ్రమంలో ఉంటున్నట్లు తెల్సింది,

అక్కడినుంచి చక్కగా దియారాకు వచ్చాడు. ఏడేండ్లుగా తనయుని రాక కోసం ఎదురుచూస్తున్న తల్లి ఒడిలో ఒదిగిపోయాడు. కన్నీటితో కొడుకును గాఢంగా కౌగిలించుకుందామె.

జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ.

## రాజకీయ వాతావరణం

1906 16లో హోంరూల్ ఉద్యమ నిర్వాహకుడు, 'కేసరి' మరాఠా పత్రికాధిపతి, ప్రముఖ అతివాద కాంగ్రెసు నాయకుడు బాలగంగాధర తిలక్ 1920లో మరణించాడు.

1921లో గాంధీజి సహాయ నిరాకరణ స్వాతంత్ర్యోద్యమం ఉప్పెనః లేచి చల్లారింది.

1928 సైమన్ కమీషన్ వ్యతిరేకత దేశంలో తీవ్రస్థాయికి చేరింది. "పంజాబ్ కేసరి" లాలాలజపతిరాయ్ అదే సందర్భంలోలాహోర్ ప్రదర్శనలో లాఠీ దెబ్బలు తిని మరణించాడు.

మద్రాసులో సైమన్ కమీషన్ గుండె ధైర్యంతో ఎదిరించి టంగుటూరి ప్రకాశం పంతులు "ఆంధ్రకేసరి" బిరుదు పొందాడు.

1929 ఏప్రిల్ 8న భగత్‌సింగ్-బటుకేశ్వర దత్తులు ఆజాద్ చంద్ర శేఖర్ పర్యవేక్షణలో ఢిల్లీ అసెంబ్లీలో బాంబు వేసి అరెస్టయినారు.

కాంగ్రెసు సమాలోచనలు సాగుతూనే ఉన్నవి. అటువంటి పరిస్థితిలో భారతదేశానికి చేరిన జయప్రకాశ్‌కు బంధుమిత్రుల్లో, గురుజనంలో స్వాగత సత్కారాలే లభించాయి.

ముగేర్‌లో బీహార్ ప్రాంతీయ రాజకీయ సమ్మేళనం జరిగింది. సభాధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్, ముఖ్య అతిథిగా బార్డోలీ సత్యాగ్రహసేన వల్లభభాయి పటేల్, స్వామీ సహజానంద సరస్వతీ వచ్చారు. పేరుగల ఆ నాయకులు సంపూర్ణ స్వరాజ్యాన్ని కాక పాక్షిక స్వాతంత్ర్యంనే కోరినారు. నవయువకులు దానికి అంగీకరించలేదు. వారికి విప్లవ పంథా- సంపూర్ణ స్వరాజ్యం కావాలని వుంది.

తర్క-వితర్కాల అనంతరం ఓటింగ్‌లో యువకులకే విజయం లభించింది. దానికి జయప్రకాశ్ మనస్సు చాల ఆనందించింది. వృద్ధ నాయకత్వం నత్త నడక ఆయనకు నచ్చేవి కావు. ఈ సమావేశంలో ఆయన కేవలం సాక్షిగానే ఉన్నా, రాజకీయాల్లో పాల్గొనాలనే ఉత్కంఠ మాత్రం కలిగింది—ఉంది.

## గాంధీ ఆశ్రమంలో భార్యను కలుసుకొనుట

వార్ధాలో గాంధిని కల్సుకున్నాడు జయప్రకాశ్. ఏడేండ్లుగా ప్రభావతి సబర్మతిలోనే ఉంటూ సత్ప్రవర్తనతో అందరి ఆనందాన్ని పొందగలిగింది. మహాత్ముడే ఆమెను తన కూతురుగా భావించాడు.

జయప్రకాశ్‌ను గాంధీ ఆదరించాడు. ఇతడు భక్తితో బాపూజీ పాదాలకు నమస్కరించాడు. ప్రభావతి భర్త పాదాలకు ప్రణమిల్లింది. 'వార్ధానుంచి' కాంగ్రెస్ సభలకు లాహోర్ వెళ్ళాడు జయప్రకాశ్ గాంధీజీవెంట.



ఆ సమావేశానికి అధ్యక్షుడు జవహర్‌లాల్ నెహ్రూ.

31 డిసెంబర్ 1929 అర్ధరాత్రి త్రివర్ణపతాకాన్ని ఎగరవేసి సంపూర్ణ

స్వరాజ్యం తమలక్ష్యంగా—ఇదే స్వరాజ్య దినంగానూ ప్రకటించాడు నెహ్రూ-మరో ఇరవై ఎనిమిదేండ్లకు (1947) కాని అది సిద్ధించలేదు.

ఆ సందర్భంలో ప్రజల-నాయకుల ఆవేశాన్నిచూసి, దేశ స్వరాజ్య సాధనకోసం బలికావడానికే నిశ్చయించుకున్నాడు జయప్రకాశ్. ఇరువదియేండ్ల యువకుడు, రాగ భోగాలతో సుఖంగా జీవించడానికి ఉత్సాహం చూపించ వలసిన తరుణం. కాని, ఆ యువకునిలో అంతటి త్యాగదీక్ష.

## గాంధీకి తెలిపిన సొంత కోరిక

మనదేశంలో అమెరికాలోవలె సమాజశాస్త్రం అధ్యయనానికి ఒక కేంద్రం ఏర్పాటు చేయాలనే క్రొత్తకోరిక జయప్రకాశ్‌కు కలిగింది. హిందూ విశ్వవిద్యాలయం బనారస్‌లో ఆ విభాగం లేదు. ఈ విషయంలో గాంధీజీతో సంప్రదించాడు. అందుకు యేబదివేల రూపాయలు వ్యయమౌతుందని తన అంచనా తెలిపాడు. గాంధీజీ అందుకు అంగీకరించి మాలవ్యాతో సంప్రదించి, ఆ సంస్థ ఏర్పాటు జరిగేటట్లు చూస్తానని హామీ ఇచ్చాడు.

కాంగ్రెసు సభ్యులతరువాత జయప్రకాశ్‌ను నెహ్రూకు పరిచయం చేశాడు గాంధీ, వారిద్దరూ ఒకరి స్వభావానికి ఒకరు ఆకర్షితులైనారు. తన కోరిక గాంధీ వాగ్దానం గూర్చి తెలిపాడు నెహ్రూజీకి జయప్రకాశ్.

"ఆ యూనివర్శిటీ గొడవ వదిలేసెయి. అఖిలభారత కాంగ్రెసు కార్యాలయానికి నడు. అక్కడి పనిచూసుకో." అన్నాడు నెహ్రూ.

ఆశ్చర్యపడ్డాడు జయప్రకాశ్ ఆ మాటలకు. మొదటి పరిచయంలోనే ఆ నేతకు తనపై ఇంతటి విశ్వాసం కుదిరినందుకు ఆనందించాడు. అలహాబాద్ చేరి స్వరాజ్యభవన్' లో ప్రవేశించాడు.

## నెహ్రూ కుటుంబంతో మైత్రి

కాంగ్రెసు కార్యాలయం స్వరాజ్యభవన్‌లో జయప్రకాశ్ క్రమశిక్షణగా మెదలుతూ రికార్డులు-పేపర్లు చక్కగా భద్రపరచేవాడు. కార్యక్రమాల సూచికలు, సమావేశాల వివరాలు సారాంశాలు వ్రాసి వుంచేవాడు. నెహ్రూ మనస్సుకు అతని రాకతో చాల నెమ్మది కలిగింది. క్రమంగా వారి పరిచయం స్నేహంగా మారింది. నెహ్రూజీకి జె. పి. తమ్ముడుగా ప్రేమ చూరగొన్నాడు.

ఆ కాలంలో విరామ సమయాల్లో తరచు ఆనంద్‌భవన్‌కు వెళ్ళడంతో నెహ్రూ కుటుంబంతో చనువేర్పడింది. వదిన కమలనెహ్రూ కోపించి ప్రభావతిని సబర్మతీనుంచి అలహాబాద్ పిలిపించింది. ఆమె గాంధీగారి ఆశ్రమంనుంచి నెహ్రూ ఇంటికే వెళ్ళింది. స్వరాజ్యభవన్‌లో భర్తతోపాటుగా వుంటున్నా నెహ్రూ కుటుంబ సభ్యుల్లో ఒకర్తిగా మారిపోయింది.

జయప్రకాశ్ పనికి సంతృప్తుడైన నెహ్రూ జయప్రకాశ్‌ను ఆ తర్వాత కాంగ్రెసుపార్టీ కార్యదర్శిగా తీసుకున్నాడు.

## దండి ఉప్పు సత్యాగ్రహం

**13** మార్చి **1930**కి సబర్మతీనుంచి ఆరంభమయిన గాంధీజీ కాంగ్రెసు

ఉప్పు సత్యాగ్రహం, 6 ఏప్రిల్ నాటికి దండిలో ఊపునందుకుంది. ఉప్పుపై ప పెంచిన కారణంగా ఆంగ్ల ప్రభుత్వాన్ని ఉల్లంఘించి, స్వయంగా ఉప్పు తయ చేయడం దాని ధ్యేయం. శాసనోల్లంఘన మన్నమాట.



దానితో దేశమంతా సంచలనం చెందింది. ఆంగ్ల ప్రభుత్వం క చెందింది-కంపించింది. పోలీసు లాఠీచార్జీలు-తుపాకి కాల్పులు పెరిగినై. అ సంఖ్యలో సత్యాగ్రహులను అరెస్టుచేసి జైళ్ళను నింపారు. ప్రజా ఆందోళన చూసి వైస్రాయి ఇర్విన్ గాంధీతో సమావేశం జరిపి సంప్రదింపులు సాగించా

కాంగ్రెసు పార్టీపై విధించిన రద్దు తొలగించబడింది. 1930 రౌండ్ టేబిల్ సమావేశానికి గాంధీని లండన్‌కు రావాల్సిందిగా ఆహ్వానించారు.

ఈ వ్యవహార మంతటికి కార్యనిర్వాకుడుగా జయప్రకాష్ స్వయంగాపాలు పంచుకొన్నాడు.

## మాతృ వియోగం

జన్మభూమి దాస్యబంధాలు తెగవేసే ప్రయత్నంలో పరిశ్రమిస్తున్న ఆ కాలంలోనే జయప్రకాశ్ జనని పూలరాణి మరణదశలో ఉన్నట్లు కబురంది పరుగెత్తాడు. కొడుకు సేవకు ఆమె నోచుకోలేదు.

పుత్రుని చూడటం కోసమే ఆమె ఇన్నాళ్ళు ప్రయత్నంగా ప్రాణాలను కనుగూళ్ళలో నిలుపుకొని వున్నట్లుగా నీరసించి వుంది. ప్రేమతో తనయుని తనివి తీరా చూసి కలనిమిరి ఆ తల్లి శాశ్వతంగా కళ్ళుమూసింది. పసిపిల్లవాడుగా వెక్కి వెక్కి యేడ్చాడు జయప్రకాష్. విధి విధానంగా మాతృమూర్తి దహనసంస్కారం కావించాడు.

అతని తండ్రి మనోవ్యథతో క్రుంగిపోయి మంచంపట్టాడు. అశక్తతకు తోడు వృద్ధాప్యం, సతీవియోగం పైగా అప్పులబాధ. తల్లి మరణవ్యయంతో పాటు తండ్రి వైద్యం ఖర్చులు, కుటుంబ నిర్వహణ రుణభారం జయప్రకాష్‌పై పడినై అనుభవం లేదు. ఇన్నాళ్ళు ఇంటికి దూరంగా వున్నాడు. ఇప్పుడు తానే పెద్దదిక్కు. తప్పించుకోలేని పరిస్థితి.

గాంధీజీకి తన విషయం నివేదించాడు. ఉద్యోగం చూడాలన్నాడు. గాంధీజీ బిర్లాకు చెప్పాడు. పిలానీ కాలేజీలో లెక్చరర్ పోస్టు జయప్రకాష్‌కు ఇవ్వవల్సిందిగా కోరాడు. జె.పి. విద్యా వినయ సంపదను నిజాయితీని గూర్చి విని చూసి తన పర్సనల్ సెక్రటరీగా ఉద్యోగం ఇచ్చాడు బిర్లా.



అంతా రెండు మాసాలు గడిచేసరికి గాంధీ-ఇర్విన్ ఒప్పందం వల్ల కాంగ్రెసు నాయకులు జైళ్ళనుంచి విముక్తి పొందారు. పార్టీ పని పెరిగింది. నెహ్రూజీ జయప్రకాష్‌ను మళ్ళీ స్వరాజ్యభవన్‌కే పిలిచాడు.

ఆ దశలోనే 1930లో "అపూర్వ సత్యాగ్రహం" పేర జయప్రకా
కాంగ్రెసు చరిత్రను ప్రశంసాపాత్రంగా రచించాడు.

## బందీ జీవితం

ఆ సత్యాగ్రహ పోరాటాల సందర్భంలో కాంగ్రెసు నాయకులతో పా జయప్రకాష్‌కూడా బందీ అయినాడు. జైలు జీవితం మామూలే, ప్రతీదానికి ఇ దిగా వుండేది. అక్కడ ఖైదీల పరిస్థితి సౌకర్యాల మెరుగుపడడం కోసం కమ నిస్టులతో కలిసి నిరసన వ్రతాలుచేసి సాధించుకున్నారు. అక్కడా ఊరకే కూ లేదు. పరిసరాల పరిస్థితుల పరిశీలిస్తూ భావి కార్యనిర్ణయాల గురించీ బంధుమి లకు ఉత్తరాలు వ్రాసేవాడు. దేశ భవిష్యత్తునుగూర్చి ఆలోచించేవాడు.

భార్యకు వ్రాసిన ఈ లేఖలోని విశేషాంశాలు చూడండి, "నేను ! నిన్నటి రాత్రి రెండు ఉత్తరాలు పంపించాను. ఆ ఉత్తరాలు నీకు చేరినట్లయితే విషయం నీ ఉత్తరంలో సూచించమని అందులో వ్రాశాను.

బబునీ ఇంట్లో అందరు బాగున్నారా? మురార్‌లో ఇంకా డాల్టెన్‌గంజ్ కూడా బాగా వున్నారా?

ఖండవాలో నీ ఉత్తరం చేరింది. అందులో నా లేఖలు నీకు చేరినట్లు ఏ గుర్తూ లేకపోవటం కొంత బాధకల్గింది. విచారిస్తే ఆ వ్యక్తి నీకు ఉత్తరాలు ఇచ్చే వాడేనని తెల్సింది. అతను భయపడ్డాడు. దాన్ని నీకివ్వక తన దగ్గరే వుంచు కున్నాడు. బెదిరిస్తే నాకు ఆ ఉత్తరం వాపసు ఇచ్చాడు. అందుకే నిన్ను నేను తిరిగి పిలిపించాను ఈ ఉత్తరం తీసుకొని బొంబాయి వెళ్ళాలి. అందులోని

సూచన ప్రకారం పురుషోత్తంను నాకు ఉత్తరం వ్రాయమని చెప్పు. ఆ విషయం నేను నా ఉత్తరాల్లో తెలిపాను. నువ్వుకూడా ఆ పద్ధతిని అర్థం చేసుకో.



ఏదైనా ఓ పాతపుస్తకం మందపుది తీసుకో, దానిపై అట్టలు కూడా మందంగా వుండాలి. కవర్ అట్ట చీల్చు. దానిలోపల నీ లేఖనువుంచి తిరిగి చక్కగా అతికించి నాకు పంపించు. బసావన్ ఇంకా ఇతర మిత్రులను కూడా అలాగే చేయమను—వారేమైనా వార్తలు నాకు పంపదలిస్తే.

రెండు మూడు ఇతర పుస్తకాలతోపాటు ప్రేంచంద్ నవలకూడా ఒకటి పంపించు దానిలోనే ఉత్తరం పెట్టు. ఒకవేళ ఇతర పుస్తకాల్లో లేఖ పంపితే దాని లోని 100 పేజీక్రింద పెన్సిల్‌తో...గుర్తుపెట్టాలి. నేను ఆ గుర్తున్న పుస్తకం కవర్‌నే చించి దాన్ని తీసుకుంటాను.

బసావన్‌ను ఇక అండర్ గ్రౌండ్‌కు వెళ్ళి రహస్య పార్టీకి నవయువకులను చేర్చుకొమ్మను. దీనికోసం పాత పద్ధతుల్లోనే డబ్బు సేకరించుకోవాలి దానికి వేరు మార్గంలేదు. శుక్లాగారుకూడా నా సలహాను ఇష్టపడతారు. రహస్య సంఘం కాంగ్రెసు సోషలిస్టుపార్టీకి వేరుగా ఉండదు. కాని దాని పేరు వేరే పెట్టవచ్చు.

గంగాబాబు దేశాన్ని విడిచి విదేశాలకు వెళ్ళే ప్రోగ్రాం వీలుకాకపోతే కనీసం అఖిలభారత సంఘ సంయుక్త కార్యదర్శి స్థాయిలోనైనా పనిచేయమను. ఆయన దేశపర్యటన కావించాలి. ఆఫీసు పనికూడా నిర్వహించాలి.

మేం ఇక్కడ నాలుగురోజుల నిరహారదీక్షకు పూనుకున్నాం. ఆ విషయ చర్చ మన ఉత్తరంలో కావించాను. బొంబాయిలో దాని కాపీని తీసుకొని నీ వెంట బాపూజీ దగ్గరికి తీసుకెళ్ళు. దానికి సంబంధించి ఈ ఉత్తరంలో మూడు కాగితాలు ఉన్నవి. వీటి నకళ్ళు నీ వెంట తీసుకెళ్ళు.

ఎస్. ఎం, జోషి, ఎస్. ఎం. ఫ ఇక్కడికి వచ్చారు. మేమతనికి అన్నీ వ్రాసి ఇచ్చాం. ఆయనను కలవమని పురుషోత్తంకు చెప్పు. నా లేఖ కాపీకూడా గాంధీజీ దగ్గరికి తీసుకురావాలను. ఒకవేళ పురుషోత్తం దాని కాపీ యివ్వడానికి ఇష్టపడకపోతే భాపూజీ అతనికి వ్రాసి తెప్పించుకుంటారు.

నేనీ ఉత్తరం నీకిస్తానని తీసుకొచ్చినా ఇవ్వలేకపోయాను. అందుకే దీన్ని అదే మనిషిద్వారా పంపిస్తున్నాను. ఒకవేళ ఈ ఉత్తరం నీకు దొరికివుంటే రేపు నీవు నన్ను కల్సుకోవటానికి వచ్చినప్పుడు "రాత్రి నాకు తలనొప్పిగా ఉంది" అను, నీకు నాచిట్టీ చేరిందని గ్రహిస్తాను.

నీవు గఫార్ ఖాన్ సాహెబును నార్థాలో కల్సుకోగల్గితే హజార్ జిల్లా కాంగ్రెసుకమిటీ అధ్యక్షుడు "హకీఅబ్దుల్ సలాంసాహెబ్"ను ఇక్కడ వేరే క్యాంపులో ఉంచారని చెప్పు. ఆయన ఆరోగ్యం బాగుంది. కాని ఆయన చేతులకు నొప్పులు. ఖాన్ సాహెబును ఇతనిక్కడ బాగానేఉన్నట్లు దయతో సలాంగారింట్లో కబురందించుమను ఖాన్ సాహెబు ఉత్తరాలు వారింటిలో రెండుమూడు వారాల తర్వాత అందుతున్నట్లు ఫిర్యాదుచేస్తున్నాడు. వాటి సెన్సార్ ఇక్కడ అయితే అవుతూనే ఉంది. సరిహద్దు సి.ఐ.డి. లు కూడా సెన్సార్ చేస్తారు. అందుకే అంత సమయం తీసుకుంటుంది. దానికి బదులుగా సరిహద్దు ఉత్తరాల్లోని విషయాల టీకా టిప్పణిలు తీసివేయాలి. అతనికి సరిహద్దులోని ఏ వార్తాపత్రిక కూడా చదువుకోవ టానికి దొరుకుతూ లేదని మరొక ఆరోపణ. ఒకవేళ ఖాన్‌గారిని నువ్వు కలవక పోతే బాపూజీద్వారా ఒక పత్రం అతనికి పంపించు.

నీ—జయప్రకాశ్.

ఇది ఆయన దేవలీ క్యాంపు జైల్లో వుండగా వ్రాశాడు. సతి ప్రభావతి తనకు చూడటానికి వచ్చినప్పుడు ఇవ్వాలనుకునీ ఇవ్వలేకపోయాడు. వేరే వ్యక్తితో బయటకు పంపిస్తే దారిలోనే పట్టుబడింది.

భారత ఆంగ్ల ప్రభుత్వం దీన్ని పెద్ద ఆర్భాటంతో దాదాపు సమాచా

పత్రికలన్నింటిలో ప్రకటించింది. అనేక భాషల్లో రేడియో ప్రసారాలు ప్రపంచ మంతటా చేసింది. భారత విప్లవకారులలో జయప్రకాశ్‌ను నంబర్ 1 అని నిరూపించే ప్రయత్నం చేసింది.

## గాంధీజీకి లేఖ

ప్రియబాపూజీ

చరణాలకు సాదరపూర్వక ప్రణామాలు !

మీరు దయతో వ్రాసిన ఉత్తరం ప్రభద్వారా అదే సమయంలో అందింది, ఇంతవరకు నేను జవాబు వ్రాయలేక పోయినందుకు విచారిస్తున్నాను. క్షమించ ప్రార్థన.

లాహోరునుంచి నేను పంపించిన ఉత్తరం మీకు చేరిందో లేదో అని నేను ప్రభతో అన్నాను. ఆమె మీకు ఉత్తరం వ్రాయించే శ్రమ కల్గించినందుకు విచారిస్తున్నాను. అయినా మీ లేఖ పొంది ధన్యుడయినాను.

ఇది నిజం. కొన్ని ఆలోచనా రంగాలలో నేను మీకు సంపూర్ణంగా సన్నిహితుడనయినాను. అది నాకు చాల ఆనందదాయకం. అలాగే కొన్ని మౌలిక సిద్ధాంతాలలో ఈనాటికి నేను మీకు అంతే దూరంలో ఉన్నందుకు విచారిస్తున్నాను. అది ఎప్పుడూ ఉన్నదే. కాని కార్యరంగంలోనయితే నా మార్గం మీకు దూరం మాత్రమేకాదు, సదా వేరుగానూ వుంటుంది. ఇటు ఎన్ని సంఘటనలు జరిగాయో ఆ కారణంగా నేను అధిక వేగాన్నే పుంజుకున్నాను. కానీండి. మీరు వ్రాసినట్లు జైలు లోపల బయటి ఆలోచనలలో సాధారణంగా భేదం వుండనే వుంటుంది.

ఈ జైలు మనుషులుండగల స్థానంకాదు. అయినా నేను నా విడుదల దినంకోసం రోజులు లెక్కపెడుతూ లేనని, ఒక మహాయజ్ఞం చేస్తున్నట్లు భావిస్తు న్నానని విశ్వసనీయంగా చెప్తున్నాను.

క్రాంతికారులలో కొందరు మరణించడం, కొందరు సర్వస్వం కోల్పోవడం, కొందరు కారాగారాల్లో మ్రగ్గిపోవడం తప్పదు. దీనికి ఏ విధమైన అనుమానమూ అక్కర్లేదు. ఇప్పటికే వేలమంది జైళ్ళలో వున్నారు! ఇకముందుకూడా వేలాది నులు బంధింపబడుతారు.

ఇప్పుడు మా ఉద్యానవనంలోని వర్షాకాలపు పూల వాడిన ముఖాలపై ుసలి ముడతలు పడినాయి. వాటి స్థానం ఆక్రమించడానికి శీతరుతు పుష్పాంకు ాలు పట్టిపొరలలోంచి తొంగిచూస్తున్నాయి. వాని భావినిర్మాణంకోసం ఇప్పుడు ా సమయంలోని చాల భాగం వెచ్చిస్తున్నాను. ఈ కల్పనతోనే ఈ నా చిన్నారి ప్రపంచంలో ఏ మూల ఏ పూవు వికసిస్తుందో తన నవ్వుతో ఏ భూభాగాన్ని కప్పు తుందో.

నా కల్పనలకు ఫలరూపాన్ని చూస్తాననే విశ్వాసాన్ని పరిస్థితులు కల్పిస్తు న్నవి.

దీనివల్ల ఆనందాన్ని అనుభవిస్తున్నాను. ఎందుకంటే తన పరిశ్రమ నిష్ఫలమైపోవడం సాధారణంగా ఏ మానవులకూ అంగీకారంకాదు.

ఈ నా వాగడంతో కొంత మనోరంజకత్వం కలగవచ్చు మీకు, ఐనా ఉత్తరం పెద్దగా అయినందుకు క్షమాపణ కోరుతున్నాను. ఈ పత్రానికి జవాబు వ్రాసే శ్రమ మీరు పెట్టుకోకుంటేనే నేను సంతోషిస్తాను.

బొంబాయిలో మీరు జ్వరపడ్డారని తెలిసి దుఃఖం కలిగింది. ఇప్పటికి మీ ఆరోగ్యం కుదుటపడి వుంటుందని ఆశిస్తాను. సర్దార్ పటేల్ గారి చరణాలకు నా నమస్కారం. ఆయన ఆరోగ్యం మెరుగవుతున్నట్లు వార్తాపత్రికలలో చదివి సంతస మయింది. త్వరలో పూర్తిగా బాగవుతారనే ఆశవుంది.

ప్రభ గత మాసంలో 15, 16 లకు వచ్చింది. ఈ మాసం చివరలో మళ్ళీ వస్తుందనే ఆశవుంది.

మీ జయప్రకాశ్.

ఇందులో జె. పి. తన ఆలోచనలు గాంధీ భావాలకు భిన్నంగా వుంటు న్నట్లు స్పష్టంగా అంగీకరించారు. ఇక పూల పరంగా కవిత్వంవలె వర్ణించింది. ఉద్యమంలో వృద్ధుల స్థానాన్ని యువకులు ఆక్రమిస్తారని చెప్పడం.

భావప్రకటనలో దాపరికం, మోమాటం ఆయనకు నచ్చవు. నీతిగా నిజాయితీగా నిర్భయంగా మెదలటం అయనకు ఇష్టం.

## అమెరికా సైనికులకు లేఖ (సంక్షిప్తం)

హిందూస్థాన్‌లోని ఒక మూలనుంచి

మిత్రులారా,

నేను మా దేశం తర్వాత అన్నిటికంటె ఎక్కువగా అమెరికాను (మీ దేశాన్ని) ప్రేమిస్తాను కనుకనే ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. అక్కడ నా జీవితం లోని అందమైన ఏడేండ్ల కాలం గడిచింది. విద్యార్థిగా మీ దేశంవచ్చి అక్కడి విశ్వవిద్యాలయాల్లోనే కాక, హొలాల్లో శిక్షణ పొందాను. నా చదువు ఖర్చుకోసం

కూలీపని చేసాను. కాలిఫోర్నియా, ఇటవా, విస్కాన్సిన్ యూనివర్సిటీల్లో చదువుతూ ఓహియోనుంచి ఉపకార వేతనం సైతం పొందాను. మీలో ఆ విద్యా కేంద్రాల్లో చదివిన వారుండవచ్చును; సోదరులుగా వారికి నా అభివందనాలు.

మీ సేవలో ఈ లేఖ ఎందుకు పంపుతున్నానంటే — నేనూ మీ వలెనే స్వాతంత్ర్య పిపాసిని. దానికొరకు మీరు మీ ప్రాణాల్ని త్యజించడానికి సిద్ధపడు తుంటారు. కాబట్టి, ఒక సమాజ (సామ్య) వాదిగా నేనిది వ్రాస్తున్నాను సమాజ వాదం వల్లనే యుద్ధాలు సమూలంగా పెకిలించి వేయబడతాయి. దానివల్లనే స్వాతంత్ర్య పరిరక్షణ జరుగుతుందని నా విశ్వాసం.

మరో విషయం- మీకు తెల్సు. ఆంగ్ల సామ్రాజ్యవాదులు హజారీబాగ్ కారాగారంలో నన్ను బంధించారు. అవకాశం లభించినప్పుడు ప్రతి యుద్ధ ఖైదీ శత్రుపంజరంనుంచి తప్పించుకొని పారిపోయే అధికారముంటుంది. ఇప్పుడిప్పుడే ఆ అధికారాన్ని వినియోగించుకొని బయటపడ్డాను.

దానివల్లనే స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వామిని కాగలిగాను, ఆంగ్లేయ సామ్రాజ్యవాదులు మా దేశశత్రువులు. నన్ను పట్టిచ్చినవారికి భారీ బహుమతులు ప్రకటించారు. నేనేం ఘోర అపరాధం చేయలేదు! న్యాయాన్ని వంచించలేదు.

ఒకవేళ ఏ కుయుక్తివల్లనయినా మీలో యెవరయినా శత్రువులతో యుద్ధ బందీలు కావించబడి, అవకాశాన్ని చూసి తప్పించుకొనివస్తే నిస్సందేహంగా మీరు అతన్ని వీరుడని అంగీకరిస్తారు- అర్చిస్తారు. నేను నన్ను వీరుడనిపించుకొనే

కోరికతో లేను. అపరాధినీ కాదు. తన దేశ విముక్తికోసం శ్రమించే ఒక మామూలు సేవకునిగా భావించుకుంటాను.

ఇప్పుడు ప్రపంచంలో అనేకులు స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నారు. రేడియోలో వ్యాఖ్యానింపబడుతున్న స్వేచ్ఛ అనే శబ్దం నాకు ఆదర్శవంతమైంది కాదు. అది భ్రమకారి అర్థహీనమయిందిగా తోస్తుంది.

స్వతంత్రం అనే శబ్దం నా ముందొక ప్రత్యేక రూపంతో వుంది. నా దేశం విముక్తి పొందాల. కోట్లాది నా దేశ వాసులకు ఆంగ్లేయులు తగిలించిన సంకెళ్ళు తొలగిపోవాలి!"

మీరు స్వతంత్ర దేశ సైనికులు. కాలవశాన మా దేశానికి చాల సమీపానికి వచ్చారు. అందుకని మీరు మా స్వాతంత్ర్య పోరాట ప్రాధాన్యతను అర్థంచేసుకొని మా ఉద్యోగులకు సహకరించాలి.

నాగరికుల అసత్య ప్రచారాల గూర్చి మీకు చక్కగా తెల్సు. డా॥ గోబెల్స్ అసత్య ప్రచారమూర్తిగా మారాడు. సామ్రాజ్యవాద అసత్యాలకు గురువులు చర్చిల్, హైలిఫక్స్, ఎవరీ, ఇంకా ఆంగ్లేయులు వారి అనుయాయులు.

భారతదేశం గురించి మీముందుకు రెండు అసత్యాలు వచ్చివుంటాయి. ఆంగ్లేయుల భారతీయులకు స్వరాజ్య శిక్షణ ఇవ్వటానికే ఇండియాలో ఉన్నారట, మేం యోగ్యులం కాగానే వెళ్ళిపోతారట. అందుకు హిందూ దేశంలోని అందరూ ఒక్కటి కావాలట.

ఇదో పెద్ద అసత్య ప్రచారం గొప్పవాళ్ళ నోటనే మేమీ మాటలు వింటున్నాం. కవిత్వాలు, కథలు, సాహిత్యం, విజ్ఞానం యీ అసత్యాలకే పవిత్రత

ముద్ర వేస్తున్నది. ఉదారులైన ఆంగ్లేయులు కూడా ఈ భావాలనుండి విముక్తి పొందుతూ లేరు.

సామ్రాజ్యవాదం వెంట పరుగుదీస్తూ వాళ్ళు మాకు స్వరాజ్య శిక్షణ ఇస్తా



మనటం ఒక ప్రేలాపన మాత్రమే. సామ్రాజ్యవాదం దోపిడీ కోసం జరుగుతుందని మీకు తెలుసు. నా దేశాన్ని ఆంగ్లేయులు ఎలా లూటీ చేసిందీ, ఎలా నెత్తురు పీల్చి పిప్పి చేసింది తెలిస్తే మీరు ఆశ్చర్యపోతారు.

హిందూదేశం ఆంగ్ల బానిసత్వం పొందకముందే ఒక స్వతంత్రం దేశం.

స్వరాజ్య శిక్షణ మరే దేశంనుండీ పొందే అవసరం దీనికిలేదు. కానయితే ఇక్కడ అంతర్గత కలహాలుండేవి. అదే వారి మాటలకు కారణమైతే, ఐరోపా దానిచుట్టు ప్రక్కల ద్వీపాల రాజ్యాలు స్వరాజ్య శిక్షణ పొందటం అవసరం. ఎందుకంటే అవి ఎప్పుడూ పోరాడుకుంటూ రక్తపాతం కావిస్తున్నాయి.

ఆంగ్ల అబద్ధీకులవి రెండు విధాల రూపాలు. భారతదేశంలోని ఎన్నో ప్రాంతాల్లో దేశీయుల పరిపాలన వుందంటారు. కాని స్వపరిపాలకులకేపాటి విలువ వుందో, ఈ మధ్యనే సింధూ ప్రధానమంత్రి శ్రీ అల్లాబక్షీని గవర్నర్ డిస్మిస్ చేశారు.

ఆయన దోషం-ఖాన్ బహద్దూర్ భిరణాన్ని ప్రభుత్వానికి వాపసుచేశాడు. దేశంలోని పద్ధతి ప్రకారం తన అసమ్మతి తెలిపాడు. కేవలం ఈ అపరాధానికే గవర్నర్ అలా చేయడమా-అంత అధికారమా? ప్రజా ప్రతినిధుల విశ్వాసం పొందిన ఒక ప్రధాన మంత్రిని అలా తొలగిస్తాడా? ఇంతేకాక-బెంగాల్ లోని ఒక పెద్ద సుబాలో ఒక మంత్రి డా॥ శ్యాంప్రసాద్ ముఖర్జీ తన పనిలో అడుగడుగున గవర్నర్ జోక్యం కల్పించుకోవడంవల్ల పదవికి రాజీనామా ఇచ్చాడు. ఈ ప్రాంతీయ పరిపాలనలు డొంక తిరుగుడు వ్యవహారాలు.

దేశంలో ఐకమత్యం కనిపించగానే స్వరాజ్యం ఒప్పగిస్తామని ఆంగ్లేయులంటున్నారే-బెంగాల్, సింధూల్లో ఏకత వుంది కదా.

అక్కడి మంత్రి మండలిలో అన్ని పార్టీల వ్యక్తులున్నారు. వ్యతిరేక పార్టీ ఉందంటే ప్రజాస్వామ్య పరిరక్షణకు అలా ఉండవల్సిందే. మరి ఆ ప్రాంతాల్లో స్వపరిపాలన నెందుకు నడవనీయలేదు.

నాకు నమ్మకం-వారికి మా దేశం వదలి పోవాలని లేదు.

ఇదీ పరిస్థితి. సమస్త భారతీయులు వారికి వ్యతిరేకమే. భారతీయ కాంగ్రెస్ మరియు మా సోషలిస్టు పార్టీ. పాశవిక అవినీతి విధానాలకు విరోధుల మని పదే పదే చెప్పారు. ఈ ప్రపంచ మహాయుద్ధం ఆరంభానికి చాల ముందు నుంచే, చాల ప్రజాతంత్రాలు తమ స్థానాలను ఎన్నిక చేసుకోవటానికి ముందే, దేశీయ సామ్యవాద భారత్ సంస్థ, ప్రజాతంత్ర స్పెయిన్‌కు యింకా చాంగ్‌కై షేక్ చీనా ప్రజాస్వామ్యానికి తమ మద్దతును చాటింది. జర్మన్, ఇటలీ, జపానులను వ్యతిరేకించింది. ఒకవేళ భారతదేశం స్వతంత్ర్యం పొందితే ఈ అంతర్జాతీయ కల్లోలంలో దీనిది బలమైన పాత్ర వుంటుంది. దీని జోక్యంవల్ల ఈ (ద్వితీయ) ప్రపంచయుద్ధం ఆగకున్నా ఆసియాలో మాత్రం వ్యాపించదు. స్వతంత్ర భారత్ చీనా కల్సి ఏ దురాక్రమణ వాంఛగల దేశాన్నయినా భయపెట్టగల్గుతాయి. ఈ రెండు దేశాలు కల్సి పనిచేసే వీలు కలిగితే ఈ కాలపు చరిత్ర మరో తీరుగా వ్రాయబడుతుంది.

అందుచేత స్వతంత్ర సైనికులయిన మిమ్ము నేను మా స్వతంత్ర పోరాటానికి సహకరించవల్సిందిగా కోరుతున్నాను. మూడువిధాలుగా మీ సహాయం అందించవచ్చును.

మొదటిది, మాకు విరోధంగా ఫాసిస్టు పోరాటం ఆరంభించిన ఆంగ్లేయుల దుష్ప్రచారాలకు దూరంగా ఉండండి. దౌర్జన్య విషయాలలో ఆంగ్లేయులకు సహక రించవద్దనే మీకు మీ ప్రభుత్వం ఆదేశించిందని విన్నాను.

రెండవది-మీరు మీ దేశ ప్రజలకు, నాయకులకు, ప్రభుత్వానికి భారత

దేశ సంబంధంతో సత్యసమాచారాన్ని, మంచి సలహాలను ఇవ్వండి. మీరు మా మధ్యలో ఉన్నారు కనుక మా దేశంగురించి అధికార పూర్వక సమాచారం ఇవ్వ వచ్చును. మీదేశ సానుభూతిని స్నేహాన్ని మాకు కలిగించి సహకరించవచ్చును.

ఇక మీతో కాగల మూడవ సహకారం-ఆంగ్లేయ సైనికులకు అధికారులకు కూడా భారతదేశాన్ని గూర్చి సరియైన సమాచారాన్ని అందించండి. వారు మంచి ఏరులు సత్య విషయాలు వారిముందు పెడితే మా ఉద్దేశ్యాలను న్యాయంగా గ్రహించడానికి వారు వెనుకాడరు. ఇప్పుడు వారి మనసుల్లో తప్పుడు అవగాహన, హిందూదేశం యెడల తెలియనితనం ద్వేషం నిండి వున్నాయి. అందుకే వారు మాకు హానిచేస్తూ తమ ఆదర్శాలకే భంగం కల్గించుకుంటున్నారు. ఆంగ్ల సైనికుల అనేక శ్రమజీవుల కుటుంబాలనుంచే వస్తారు. వాళ్ళు కూడా సామ్రాజ్యవాద పీడితులను వ్యతిరేకించేవారే. వాళ్ళ ఉద్దేశ్యం మాది వేర్వేరు కావనే సత్యాన్ని గ్రహించాలి వాళ్ళు.

ఎందాక ఈ సామ్రాజ్యవాదం భంగంకాదో, నశించదో అందాక ఆంగ్ల జనం పీడన దారిద్ర్యం తొలగిపోవు. ఇంగ్లాండులో కూడా ప్రపంచ యుద్ధానంతరం కొత్త సామాజిక వ్యవస్థను రూపొందించుకోవాలనే చర్చ ఘనంగా సాగుతున్నది. ఆంగ్ల సైనికుల ఆ భవిష్యత్తు మీద నాకు ప్రగాఢ విశ్వాసముంది.

అందుకే మీరు ఆంగ్లసైనికులకు చెప్పండి. ఒకవేళ వారు ఒక నూతన మైన మంచి ప్రపంచాన్ని ఎక్కడ ధనం-అవసరం, బలం-మర్యాద, శిక్షణ-సంస్కృతి యిలాంటి జీవితపు ఉత్తమ సాధనాలు అందరికీ పంపకం అయ్యేది-

రూపొందించుకోవాలనుకుంటే వారు చేస్తున్న పెద్ద తప్పు. స్వాతంత్ర్యం కోసం తీవ్రంగా పోరాడుతున్న ఆసియావంటి పెద్దఖండంలో ఫాసిస్టు ధోరణిలో కుదిపి వేయడం-బాలురపై స్త్రీలపై గుండ్లవర్షం కురిపిస్తూ, దేశ భక్తుల ఇండ్లను లూటీచేస్తూ కాలుస్తూ తిరగడం, మా పోరాటం వారితో కాదని చెప్పండి. వారికి ఏ హాని కలిగించాలని లేదు. ఆంగ్ల ప్రజలపై మాకు చెడుభావంలేదు. మా యుద్ధం ఆంగ్లప్రభుత్వం మీద, మేం దాన్ని నష్టపెట్టడంలో లీనమై ఉన్నాం. ఎందుకంటే అది మా స్వేచ్ఛకు ఆనందానికి అభివృద్ధికి శత్రువు. మీరు వారితో ఇదీ చెప్పండి. మేం తప్పక స్వతంత్రులమౌతాం. అప్పుడు వారి భుజాలతో భుజాలు కలిపి ప్రపంచంలోని-అన్ని దౌర్జన్యాలను పశుపవృత్తులను దూరం చేయడానికి పోరాడుదాం. అప్పుడే మన మందరం కల్సి ఒక క్రొత్త ప్రపంచం స్వరూపాన్ని రూపొందించుకోగలం వారిని చక్కగా ఆలోచించుకోమనండి. ఒకవేళ వారు తమ పాలకుల దుష్ప్రచారాల నమ్మి పోరాడితే వారి వీరత్వం వ్యర్థమే అవుతుంది. ఎందుకంటే వారి సంతానానికి విష పూరిత ప్రపంచమే లభిస్తుంది. అక్కడ అత్యాచారాలు, వైషమ్యాలు, దారిద్ర్యం, బాధలు, యుద్ధాలు ఉంటాయి. ఇంకా మారణాయుధాల స్పర్ధ-పోటీ ఉంటాయి.

మిత్రులారా-ఇదే మీకు నా సంక్షిప్త విజ్ఞాపన. ఇది మీ మనసుల్లో స్థానం పొందుతుందని నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది. స్వాతంత్ర్యయానికి జయము!

భారత విప్లవానికి జయము!!!

మీ-

జయప్రకాశ్ నారాయణ్.

ఈ లేఖలో జయప్రకాశ్ గారికి ప్రపంచ రాజకీయాలపట్ల అవగాహన,

ప్రపంచయుద్ధాల యెడల స్పందన. నవసమాజ నిర్మాణ కాంక్ష, భారత స్వాతంత్ర్య పోరాట దీక్ష ఎలా ఉందీ తెలుస్తున్నది.

## జైలునుంచి పరారీ

దేవలీ, లాహోర్, హజారీబాగ్ జైళ్ళలోకి జయప్రకాశ్‌ను మార్చారు. ఎన్నో యాతనలకు గురిచేశారు, అయినా ఎటువంటి సమాచారమూ పొందలేక పోయారు. ఆయన గుండెధైర్యం సంకల్పం బలమైనవి.

కందుకమువోలె సుజనుడు,
క్రిందబడి మగుడ మీదికిన్నెగయు సుమీ!
మందుడు మృత్పిండమువలె
క్రిందబడి యణగియుండు గృపణత్వమునన్.

(బంతిని నేలకు కొడితే పైకెగిరినట్లు బుద్ధిమంతుడు. మట్టిముద్దపడి అణిగి ఉన్నట్లు మూర్ఖుడు.)

మణి రాపిడిలోనే ప్రకాశించునట్లు మంచివారు కష్టాలలోనే రాణిస్తారు.

1940లో హజారీబాగ్ నుండి జయప్రకాశ్ తప్పించుకొని పారిపోవడం ఇంగ్లీషువారిని చకితుల చేసింది. రాజకీయ ఖైదీ కనుక ఈయనను అక్కడ పిల్లల వార్డులో ఉంచారు, 1930లో డా॥ రాజేంద్రప్రసాద్. 1932లో సరిహద్దు గాంధి ఖాన్ అబ్దుల్ గఫార్ కూడా అక్కడే బందీలుగా ఉంచబడ్డారు.

ఆగష్టు విప్లవఛాయలు ఆ జైలులోనికి ప్రవేశించాయి. ఆ పోరాట కాలంలో జయప్రకాశ్ జీ జైలుగోడల చూస్తూ "ఏమిటి నేనీ రాతిగోడల మధ్యనే పడి ఉండాలా?" నావాళ్ళు స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నారు-నేనేమో..." అనుకునేవాడు. ఆయన రక్తం ఉద్రేకంతో ఉడికిపోయేది. ఉత్సాహం పొంగు లెత్తేది. పరిగెత్తు కెళ్ళి విప్లవకారుల్తో కల్సి ఉద్యమించాలనే కోరిక బలంగా కలిగేది.

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన జయప్రకాశ్ పారిపోవటానికి పథకం ఆలోచించుకున్నాడు. దసరానాడు అందరూ పండుగ వేడుకల్లో ఉండగా రిహార్సల్ కూడా చేసుకున్నాడు. జైలు గదుల తలుపులు, ఎప్పటివరకు తెరచిఉంచేది, సిబ్బంది ఎప్పుడెప్పుడు వచ్చి వెళ్ళేది గమనించాడు. మిత్రులతో సమాలోచన జరి పాడు. సైయన్న వారిని కూడ గలుపుకున్నాడు.

దీపావళి వచ్చింది. జైలు ఖైదీలు ఉద్యోగులు బాణాసంచా కాలుస్తూ కోలాహలంగా ఉండగా—

'పరుగిడిపో ఓ పక్షి- నీ దేశం' అనే పాట వినవచ్చింది.

అది ఒక మిత్రుని సంకేతం, అదే మంచి సమయమని అయిదుగురు సహచరులతో పాటు 'ఛలాంగ్' మని ప్రహరి గోడపై కెగిరి బయటకు దూకాడు. రాళ్ళు ముళ్ళు ఉన్నాయని కాళ్ళు విరుగుతాయేమోననే భయంలేదు. ఒక్కటే ధ్యేయం పారిపోవడం. ఒక్కటే గమ్యం పోరాటం-స్వరాజ్యం!

ముందు వెనుకల చూసేదిలేదు. బాగోగులు ఆలోచించేది లేదు. పరుగు-పరుగు...రాళ్ళు కాళ్ళను, ముళ్ళు ఒళ్లను తాకినా రక్కినా రక్తాన్ని కార్చినా ఒక్కటే పరుగు రాత్రంతా. ఉదయం వరకు సురక్షిత ప్రాంతానికి ఓ

మారుమూల గ్రామానికి చేరి శ్వాస తీసుకున్నారు. అప్పుడిక గ్రామీణ రైతుల వేషాలతో ఎండ్లబండ్లపై వెళ్ళారు.



అటు హజారీబాగ్‌లో జైలర్‌కు సెంట్రీలకు కంపరమెత్తింది. ఉరుకులు పరుగులు. లాభంలేదు. పట్టుకున్న వారికి బహుమతులు ప్రకటించారు 21 వేలు.

జయప్రకాశ్‌నారాయణ్‌ను పట్టినవారికి 5 వేలు

| | | | |
|---|---|---|---|
| యోగానందశుక్లా | ” | 5 | ” |
| రామానందమిశ్రా | ” | 5 | ” |
| నారాయణ్ సింహ్ | ” | 2 | ” |
| గులాచంద్ | ” | 2 | ” |
| శాలిగ్రాంసింహ్ | ” | 2 | ” |

ఆనాడు తప్పించుకొని వెళ్ళిన సాహసికులు ఆరుగురు. ఆసంతంతో చప్పట్లు చరిచిన ప్రజలు నలుబదికోట్లు.

## అగస్టు విప్లవ మార్గదర్శి

1921 గాంధీ సత్యాగ్రహం దేశాన్ని పెద్ద వూపుఊపి "చౌరాచౌరి" హింస సంఘటనతో 22లో ఆపివేయబడింది. అప్పుడు 30 వేల సత్యాగ్రహులు జయిళ్ళపాలయ్యారు.

1923లో వేరుపడి స్వతంత్రపార్టీకి స్థాపించినా 1928లో మోతీలాల్ నెహ్రూ కలకత్తా కాంగ్రెసు సభల కధ్యక్షత వహించాడు.

1929 లాహోరు సభలకు జవహర్‌లాల్ అధ్యక్షుడు. అప్పుడే గాంధీతో పాటు వెళ్ళిన జయప్రకాశ్‌కు నెహ్రూ పరిచయం కలిగింది.

1930 దండి ఉప్పుసత్యాగ్రహంలో కాంగ్రెసు నాయకులు తిరిగి అరస్టయ్యారు.

1930 మొదటి రౌండు టేబిల్ సమావేశానికి కాంగ్రెసువాళ్ళు వెళ్ళకున్నా 1931 రౌ. టే. స. కి గాంధీజీ పాల్గొన్నారు. ప్రయోజనం శూన్యం.

1931 ఫిబ్రవరిలో అజాద్‌చంద్రశేఖర్, మార్చిలో భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురులు (ఉరితో) అమరులయినారు.

1931 ఏప్రిల్ చిటగాంగ్ ఆయుధాల దోపిడీ మిలటరీ హింసాకాండ.

1932 కాంగ్రెసు సహాయనిరాకరణ ఉద్యమంలో బంధీకావింపబడినవారు 20 వేలు.

1934లో అతివాద కాంగ్రెసు ఎన్నికల రంగంలో ప్రవేశించి కేంద్రములో 85 స్థానాలు గెలిచింది.

1936 లక్నో సభకు తిరిగి నెహ్రూ అధ్యక్షుడు. ఆ యేడే కమలానెహ్రూ మరణించటం జరిగింది. విదేశీసంచారంతో స్ఫూర్తిపొందిన కమ్యూనిస్టు భావాలతో నెహ్రూ, గాంధీని వ్యతిరేకించినా చివరికి ఆయన మాటలను అంగీకరించేవాడు. తన నూతన భావాలకు సన్నిహితం కాబట్టి సోషలిస్టులయిన జయప్రకాశ్, నరేంద్రదేవ్, అచ్యుతపట్వర్థన్‌లను సభ్యులుగా తీసుకున్నాడు. సరోజినీదేవిని కూడా కావన్నాడు. ఆ సభలో ఆ నలుగురిదొకదారి. కాంగ్రెసు వర్కింగ్ కమిటీది నచ్చలేదు. కాబట్టి గాంధీ ఆయన అనుచరులు పదిమందిది మరోదారి. బందీఖానాలో వున్నాడు కాని వచ్చివుంటే సుబాసుబాబుది మూడవ దారిగా వుండేది.

1937లో రాష్ట్రాల ఎన్నికలలో పాల్గొని 1585 సీట్లలో 711 గెలిచి 7 రాష్ట్రాలలో మితవాద కాంగ్రెసు మంత్రివర్గాల నేర్పించారు.

8 ఆగష్టు 1939న కాంగ్రెసు ప్రభుత్వంతో విచారించకనే ప్ర
ప్రభుత్వం భారతసేనలను రెండవ ప్రపంచయుద్ధంలో దింపి తూర్పుదే
పంపింది. దానికి నిరసనంగా కాంగ్రెసు ప్రభుత్వం ప్రతినిధులు రాజీనామాచే

1940లో వ్యక్తి సత్యాగ్రహానికి పిలుపునిచ్చాడు గాంధీజీ మళ్ళీ జ
నాయకుల అరుస్టుల పర్వం అరంభమయింది.

అటు జర్మనీ ఇటు జపాన్ బ్రిటిష్‌వారిని మట్టుపెట్టడానికి కది
భారతదేశం సైతం ఉడుకెక్కింది.

1942లో క్రిప్స్ రాయబారాన్ని ఇంగ్లాండు ఇండియాకు ప
అహింసావాది గాంధీకే నచ్చలేదు.

'క్విట్ ఇండియా' కాంగ్రెసు తీర్మానమయింది బొంబాయి సః
8 ఆగష్టు 1942 గాంధీ-నెహ్రూ ప్రముఖ నాయకులందరూ బందీలయ్యారు.
జడి ఆరంభమైంది. విప్లవకారులు ముందుకు దూకారు.

పనుల్లో, గనుల్లో, కార్ఖానాల్లో, గ్రామాల్లో, నగరాల్లో బ్రిటిష్ ద
మూకలపై తిరగబడ్డారు, తెల్లపులులను పిల్లుల చేశారు. ఉత్తర బీహార్, బెంగాల్
మిడ్నపూర్, సంయుక్త రాష్ట్రాల్లో (యు. పి) స్వతంత్రపాలన నెలకొల
భారత విప్లవకారులు. టెలిఫోన్ తీగెలు తెగాయి. రైలుపట్టాలు తొలిగా
వార్తలు-రైళ్ళు నిలిచిపోయాయి. అది ఉప్పెన-జనప్రభంజనం!

3 మాసాల ఈ అలజడిలో 318 పోలీస్ స్టేషన్లు, 252 పోస్టాఫీస
ధ్వంసమై, 33 లక్షల 50 వేలరూపాయల నష్టం ఆంగ్ల ప్రభుత్వానికయిం

అదంతా ఎవరి సొమ్ము? ఇండియాను దోచింది. ఉద్యమం చల్లార్చడానికి 538సార్లు కాల్పులు జరిపి 1028 మందిని చంపి 3215మందిని గాయపరచి, 60229మందిని అరెస్టు చేసినట్లు ప్రభుత్వ ప్రకటన. నిజం ఇంకా ఎంత ఎక్కువోమరి.

చావోరేవో తేల్చుకోవలసిన సమయం వచ్చింది అనిగాంధీజీ అరెస్టుకు ముందు వ్రాసిపెట్టుకున్న కాగితం ఇంతటి విప్లవానికి కారణమయింది.

ఈ ఆగస్టు విప్లవాన్ని రహస్యంగా ఉంటూ వీరోచితంగా నడిపిన నాయకుడు మన జయప్రకాశ్. ఆయన తోడుగా వేలు లక్షల వీరులు-వీరనారులు దేశపౌరులు నిలిచారు.

ఈ తిరుగుబాటులో ఆంగ్లేయులు కాల్చిచంపినవారు 40 వేలకు తక్కువగా ఉండరని జయప్రకాశ్ అంచనా. 10 వేలు మరణించారని 'డిస్కవరీ ఆఫ్ ఇండియా'లో నెహ్రూ పేర్కొన్నాడు.

9 నవంబర్ 1942న జైలునుంచి తప్పుకొన్న జయప్రకాశ్ ఆగస్టు విప్లవ సారథ్యం వహించి రహస్యంగా దేశమంతటా సంచరించాడు.

ఢిల్లీనుండి రావల్పిండి వెళ్ళుతుండగా అమృతసర్ స్టేషన్‌లో ఫ్రంటియర్ రైల్లో తిరిగి అరెస్టు చెయ్యబడ్డాడు.

ఆ దినం తేదీ 18 సెప్టెంబర్ 1943. ఆ దేశ నాయకుని లాహోర్‌ఖిల్లా జైల్లో బంధించి ఎన్నో కేసులు నడిపింది ప్రభుత్వం. ప్రజలు తమ క్రాంతి నాయకుని "భారత లెనిన్" అని పిలిచారు అభిమానంతో.

"నేను ఆయన వీరతను గౌరవిస్తాను" అని జయప్రకాశ్‌కు గాంధీజీ ప్రశంసించాడు తాను శాంతివాది అయినా.

మనం పోరాటం తుది ఘట్టం పూర్తి స్వరూపాన్ని మనసు నందుంచుకొని, మనల్ని సంఘటిత పర్చుకోవాలి. రాబోవు యుద్ధానికి సిద్ధపడుతూ క్రాంతి సేనను సుశిక్షితులుగా, దీక్షాపరులుగా తయారు చేసుకోవాలి. కేవలం అలజడి మన లక్ష్యం కాదు. పూర్తి జనత ఒకేసారి తిరగబడాలి–అనేది లక్ష్యం.



ప్రతి తాలూకా మరియు థానాలో, కార్ఖానాలో మరియు ఉద్యోగ కేంద్రాల్లో నవయువకులను ఇలాగే పోరాట సేనగా తయారు చేయాలి. వారు రాబోయే తిరుగుబాటులో మానసికంగా వస్తు రూపేణా, శారీరకంగానూ సహకరించడానికి సిద్ధంగా వుండాలి.

పైగా మనం భారత సేనలో, ఇతర ఉద్యోగాల్లో పనిచేయాలి. ప్రచార ప్రదర్శనల కార్యం వుంది. బళ్ళల్లో, కళాశాలల్లో, బజార్లలో కూడా పని వుంది. దేశీయ సంస్థానాల్లో (3,4 వందలు) మరియు సరిహద్దుల్లోనూ మనం నిలవాలి. ఇ



నా వల్ల సాధ్యం అయ్యేది కాదు. అన్ని ఏర్పాట్లను ఇక్కడనుంచి చూడలేను. మనం ఎంత చేసినా ఇంకా చేయాల్సి వుంది. ఇంకా ఇంకా చేయాలి.

మిత్రులారా! చివరిమాట- నేను మరో మారు తిరిగి మీ మధ్యకు వచ్చి నా సేవలను మీకు సమర్పించే అభిమానాన్ని, సంతృప్తిని అనుభవిస్తున్నానని

చెప్పడానికి ఆనందిస్తున్నా. మీ సేవ చేస్తే మన నాయకుల "చేయండి లేదా చావండి అనే నినాదం నిజమవుతుంది. ఇంక మీ ఆజ్ఞాపాలనమే ఏకైన సంతోషం నాకు.

హిందూస్థాన్ ఒక మూలనుంచి-

-జయప్రకాశ్ నారాయణ్.

## కాంగ్రెసుతో సంబంధం

గాంధీని గురువుగా భావించాడు, నెహ్రూను బంధువుగా అభిమానించాడు. కాంగ్రెసు కార్యాలయంలో పనిచేశాడు, సత్యాగ్రహ ఉద్యమాల్లో పాల్గొన్నాడు. కాని కాంగ్రెసుపై ఏనాడూ పూర్తిగా విశ్వాసం, ఆశ లేవు జయప్రకాశ్‌కు.

1946 జూలై మాసాన బొంబాయిలో జవహర్‌లాల్ నెహ్రూజీ కాంగ్రెస్ కార్యకర్తగా చేరమన్నప్పుడు జయప్రకాశ్ ఒప్పుకోలేదు. అందుకు ఆయన చూపిన కారణాలు ఆయన మాటల్లో-

"భారత ప్రభుత్వంలో కాంగ్రెస్, ఏనాడూ దేశ స్వాతంత్ర్యం కోసం పాటుపడని ఎలాంటి త్యాగం చేయని వాళ్ళను తీసుకుంది" అది తనకు నచ్చలేదు- అందుకే కాంగ్రెసులో చేరలేనని ఖచ్చితంగా చెప్పేశాడు.

అదే నవంబర్‌లో నెహ్రూ తిరిగి కాంగ్రెసుకు ఆహ్వానించాడు. ఒత్తిడి సైతం చేశాడు. కాని అప్పటికే జయప్రకాశ్, డా॥ లోహియా కార్యవర్గ సభ్యులయ్యాడు.

"దేశ సమగ్రతకంటే కాంగ్రెసువారికి ప్రభుత్వ అధికారమే ప్రియరిగా

వుంది" అని భావించాడు. గాంధీకి సైతం ఇష్టంగా లేదా విషయం. కాంగ్రెసు ప్రభుత్వ రంగంలో ఎన్నికలకు నిలవడం. రాం మనోహర్ లోహియా, జయప్రకాశ్ ఇద్దరూ కాంగ్రెసుతో తెగతెంపులు చేసుకున్నారు.



స్వరాజ్యం వచ్చింది 15 ఆగస్టు 1947. దేశ విభజన జరిగి స్వతంత్ర ఇండియా సమగ్రంగా కాక భారత్-పాకిస్తాన్ రెండు దేశాలుగా రూపొందడం చూసి జయప్రకాశ్ కలతచెందాడు.

1948 జనవరి 30 నాడు గాంధీజీ హత్య జరిగింది. ఇది జయప్రకాశ్‌కు చాల దుఃఖాన్ని కలిగించింది.

కాంగ్రెసుతో వేరుపడి సోషలిస్టువాదులు 1948 మార్చిలో కొత్తపార్టీని

ఏర్పరచుకున్నారు. దానికి జనరల్ సెక్రటరీ జె. పి. కేవలం 1936లో కొన్ని మాసాలు మాత్రమే కాంగ్రెసుపార్టీ మెంబర్‌గా, కార్యకర్తగా పనిచేశాడాయన.

## స్వాతంత్ర్యం తర్వాత

నెహ్రూజీ కోరినా కాంగ్రెసులో చేరలేదు. ఏ పదవినీ ఆశించలేదు. లోహియాతో సామ్యవాద పార్టీ (సోషలిస్టు) స్థాపించాడు.

1952 ఎన్నికల్లో కాంగ్రెసుతో పోటీపడి వీరి పార్టీ ఘోర పరాజయం పొందింది. దాని కారణంగా పరస్పర నిందలతో, అంతఃకలహాలు చెలరేగాయి. వాటిని రూపుమాపి పార్టీ బలాన్ని కాపాడాలని జయప్రకాశ్ 23 జూన్ 52 నుంచి ఉపవాస వ్రతం పూనాడు. వరుసగా మూడు వారాలు (21 రోజులు) ఉపవసించి, పదిహేడు పౌనుల బరువు తగ్గినా ఆయన ముఖకాంతి, గొంతు స్వరం దీప్తిమంతి మైందే కాని తరుగలేదు.

ఆ పార్టీ అంతంత మాత్రంగానే నిలిచింది. కాంగ్రెసుకు ప్రతిపక్షంగా కమ్యూనిస్టుపార్టీ ప్రాబల్యం ముందు వెనకకు తగ్గింది.

సోషలిస్టు నాయకుడుగానే కాక సర్వోదయ నాయకుని జయప్రకాశ్ నారాయణ్‌కు మంచి పేరుంది. సమాజ శ్రేయస్సు తప్ప స్వార్థ చింతనలేని సాధు వయన. చంబల్ లోయ బందిపోటు దొంగలను అహింసామార్గంతో మార్చి ప్రభుత్వానికి పట్టి ఇవ్వడం ఆయన జీవితంలోని ఒక అద్భుత ఘట్టంగా నిలిచిపోయింది. ప్రజలు ప్రశంసించారు.

## డెబ్బదపయేట దేశాన్ని మేల్కొల్పాడు

'బీహార్ బీమారీ ప్రదేశ్'గా పేరు తెచ్చుకుంది. నిజానికిది అదిమొత్తం దేశంలో వెనకబడిన రాష్ట్రం, దారిద్ర్యం, నిరుద్యోగం, అసమానత, అవినీతి వున్న చోటనే తిరుగుబాటు పుట్టుకొస్తుంది.



**26** జనవరి **1967**లో రాష్ట్రపతిగా డా॥ రాధాకృష్ణన్ లాల్ ఖిల్లానుంచి చేసిన ప్రసంగంలో- ఎక్కడ చూసినా అవినీతి, బంధుప్రీతి, లంచగొండితనం విచ్చల విడిగా కనిపిస్తున్నాయి. వీటిని అంతం చేయడానికి గట్టి ప్రయత్నంచేయక

పోతే జాతిగతి ఏమవుతుందోనన్న భయం సర్వత్రా వ్యాపించి వుంది- అని పేర్కొన్నారు. ఆ భయమే తరువాత నిజమైంది.

విమానంలోనుంచి గ్యాసుగోలాలు వదలండని ఆదేశిస్తున్నారు. ఇటు జనశక్తి-అటు జబర్దస్తీ.

జయప్రకాశ్ నారాయణ్ - అనే నినాదం వెలువడింది. జిందాబాద్ అనటానికి ముందే జనం తోసుకు వెళ్ళింది. అటు లాఠీచార్జి. జీపు దిగి ముందుకువెళ్ళినా జయప్రకాష్‌పై ఎన్ని దెబ్బలు పడ్డాయో లెక్కలేదు. కార్యకర్తలుకూడా పూర్తిగా కాపాడుకోలేక పోయారు. ఆ అలజడి తొక్కిసలాటలలో ఎందరు గాయపడ్డారో.

ఆఫీసర్స్ హాస్టల్ ముందు ఒక మంచంలో కొంతసేపు విశ్రాంతి తీసుకొని, తిరిగివెళ్ళి ఎం. ఎల్. ఎ. క్వార్టర్స్ దగ్గర ఒక మంత్రి ఇంట్లో విశ్రాంతి తీసుకొని, 3, 4 గం॥ సమయానికి సత్యాగ్రహులతోపాటు విధాన సభకు వెళ్ళాడు. ఇన్ని జరిగినా ప్రకటించిన కార్యక్రమాన్ని వదులుకోలేదు.

జె. పి. పై లాఠీ ప్రయోగానికి దేశం విస్తుపోయింది. బీహారీయులు ఖిన్నులయ్యారు. ఆవేశంతో నిండారు. స్త్రీలు కన్నీరు కార్చారు.

రేణు తన పద్మశ్రీ బిరుదును, 300 రూ॥ మాసిన గౌరవ వేతనాన్ని ప్రభుత్వ చర్యకు నిరసనగా త్యజించాడు.

జయప్రకాష్ నోట వెళ్ళింది ఒకేఒక వాక్యం.

"వినాశకాలే విపరీత బుద్ధిః॥

## ఛలో ఢిల్లీ

18 మార్చి 75 నాటికి బీహార్ ఆందోళన మొదలయి సంవత
నాటినుంచి జనతా ప్రభుత్వాన్ని ఊరూరా స్థాపించాలని నిర్ణయించారు.
నుంచి 31 జూలై మూడుమాసాల కాలాన్ని అందుకోసం జయప్రకాశ్
చాడు.

ఉద్యమం పట్నాలనుంచి పల్లెలకు విస్తరించింది. "జైలు
స్వరాజ్యం వచ్చింది జైలునుంచే మీకు అధికారాలు ప్రాప్తిస్తాయి. ప్ర
అధికారాలు లభించడమేకాక మంచి స్వచ్ఛమైన స్వతంత్రం సిద్ధిస్తుంది" అని జె
ఉద్బోధ.

## కాళరాత్రికి కిరణాలు

12 జూన్ 75, ఇందిరా ప్రధాని ఎన్నిక చెల్లదని కోర్టు తీర్పు పడింది. అదేరోజు గుజరాత్‌లో కాంగ్రెస్ ఓడింది.

24 జూన్‌న ఇందిరాగాంధి అప్పీల్‌పై కృష్ణయ్యర్ తీర్పు గత తీర నాన్నే బలపరచింది ప్రధాని గద్దె దిగాలి. దిగకపోతే చేయవలసిన కార్యక్రమం గూర్చి ప్రతిపక్షాల నాయకులు మొరార్జీ ఇంట్లో సమావేశమైనారు. జె.పి. ఆ సమావేశంలో వున్నా 25న పాట్నా వెళ్ళవల్సి వుంది. మిత్రుల కోరికగా ఆ రోజు ఆగి 26 నాడు వెళ్ళాలనుకున్నాడు.

29 నాడు ఇందిరాగాంధి నివాస భవనంముందు ధర్నా జరపాలని నిర్ణయం జరిగింది. అంతకీ సంతృప్తి చెందక జె.పి. సత్యాగ్రహుల సంఖ్య అడిగాడు. 15 వేల మందిని వాటాల వారిగా లెక్కచెప్పారు ప్రతిపక్షాల నాయకులు.

ఈ విషయమంతా గూఢచారులతో ప్రధానికి చేరింది. ఆమె ఆలోచనలు వేరుగా పయనిస్తున్నాయి. 1975 జూన్ 25 సాయంత్రం ఢిల్లీ రాంలీలా మైదానంలో జె.పి. ఇలా గర్జించాడు.

“ఇది భారతదేశం. ఇక్కడ నియంతృత్వం సాగదు. అలాంటి వారిని ఈ దేశం సహించదు. (రాజ్యాంగాన్ని మార్చి అధికారాన్ని చేతుల్లోకి తీసుకోవడం. పత్రికలపై సెన్సార్ ఏకపక్ష పరిపాలన నియంతృత్వానికి చిహ్నాలేకదా) నేను రాజద్రోహం చేస్తున్నానని శ్రీమతి గాంధి భావిస్తే ఆమెకు నాపై కేసునడిపే స్వేచ్ఛ వుంది. ఆమె తన కేసు సందర్భంలో 27 సార్లు అబద్ధాలాడిన విషయం మీరు మరచి పోకండి. అంటే 15 నిముషాలకొక అసత్యం! తననూ అలాగ అసత్య ఆరోపణలతో నిందస్తుందని చెప్పడం.

ఆ రాత్రి 8 గం॥లకు రాష్ట్రపతి ఫకురుద్దీన్‌ను కల్సి ప్రధాని ఇందిరా గాంధి ఎమర్జెన్సీకి ప్లాను వేయటం జరిగింది. వెంట సిద్ధార్థ శంకర్‌రే ఉన్నాడు. 11 గం॥ హోం మినిష్టర్ బ్రహ్మానందరెడ్డి పిలువబడ్డాడు. నిర్ణయం విన్నాడు. మరో అధికారి పదకొండున్నరకు ఎమర్జెన్సీ కాగితంపై రాష్ట్రపతి సంతకం చేయించి తెచ్చాడు.

అర్ధరాత్రి ఆవరించింది కాళరాత్రి. ఆ ప్రముఖపత్రంపై తేదీ వేయబడక పోవడం వింత. రాత్రి ఏం జరిగిందనేది ప్రముఖ మంత్రివర్యులకు కూడా

తెలియదు. ఉదయం ఐదు గంటలకు మంత్రిమండలి సమావేశం జరిపి ఆమోద ముద్ర వేసారు.

## కారాగారానికి నడిచాడు

రాత్రి సభానంతరం తొమ్మిది గంటలకు 'గాంధీ ప్రతిష్ఠాన్'లోని తన శిబిరానికి వెళ్ళాడు జయప్రకాశ్. ఆయన అలసటను ఉత్సాహం కప్పివేసింది. ప్రయాణాలు, సమావేశాలు, సమాలోచనలు కొన్ని వారాలుగా విశ్రాంతి లేకుండా వుంది. అయినా ప్రభుత్వాన్ని గద్దెదించగలమనే జనశక్తి సన్నాహం సంతృప్తిని కలిగించింది. ఉదయం పాట్నా వెళ్ళటానికి విమానం టికెట్టు రిజర్వు అయివుంది.

జనశక్తిని సరిగా అంచనా వేయలేక విరోధినాయకులు ఉద్యమంలో చేరటానికి పూర్తి అంగీకారం తెల్పలేకపోవటం విచారంగా వుంది. రావటమా వద్దా అని తటపటాయిస్తున్న జగజీవన్‌రాం కాంగ్రెసు మంత్రి దగ్గరికి చంద్రశేఖర్‌ను పంపాడు.

పదకొండువరకు చూసి నిద్రపోయాడు జె. పి. అర్ధరాత్రి అరెస్టు వారెంట్‌తో పోలీసాఫీసర్ వచ్చాడు. జె.పి మిత్రుడు రాధాకృష్ణ, కొడుకు చంద్రహార్ పిలవగా వచ్చి కాగితం చూశాడు. సుశీల్‌కుమార్ సంతకంతో వుంది. స్తబ్దుడయ్యాడు. మొదట వారిని కొంచెం నిద్రపోనీండి-అని కోరాడు రాధాకృష్ణ. టెలిఫోన్ ఆపరేటర్‌ను పిలిచి బొంబాయి, బెంగుళూరు, మద్రాసు, పాట్నా, ఢిల్లీ వీలైనన్నిచోట్లకు తమవారికి ఈ సమాచారం వెంటనే తెలియజేయమన్నాడు.

దాదాపు 2 గం॥ అనంతరం 3 గం॥ వేళకు పోలీస్ ఆఫీసర్ ఒత్తిడితో లోకనాయక్‌ను లేపి వారెంట్ చూపారు.

"క్షమించండి. మిమ్మల్ని వెంటనే తీసుకురావాల్సిందిగా ఆర్డర్" అన్నాడతడు. జె. పి. మౌనంగా లేచి సిద్ధమయ్యాడు.



ఒక కప్పు టీ త్రాగి వెళ్ళండి-అన్నాడు రాధాకృష్ణ. చంద్రశేఖర్ రావచ్చునని అతని ఆశ. రాజ్ నారాయణ్ అప్పటికే బందీ అయ్యాడు.

వాకిట్లో మూడు లారీల నిండుగా పోలీసులు వేచివున్నారు. జయప్రకాశ్ వెళ్ళి ట్రక్కులో కూర్చున్నాడు. అప్పుడే టాక్సీలో దిగిన చంద్రశేఖర్ జె. పి.ని చూసి నమస్కరించాడు. ట్రక్కు కదిలింది. దానివెనక కారులో రాధాకృష్ణ, చంద్రశేఖర్ వెళ్ళారు.

పార్లమెంట్ వీధి పోలీస్‌స్టేషన్‌కు చేరుకున్నారు. ఎస్. పి. ఇతర ఆఫీసర్లతో వచ్చి జె. పి. ని చూసి వెళ్ళాడు. ఫోన్‌పై వార్త వ్యాపించి కొందరు విలేకరులూ వచ్చారు.

"మీరు గిరఫ్తార్ అయినారు" అన్నాడు చంద్రశేఖర్, ఆశ్చర్యపడ్డాడు జయప్రకాశ్. తర్వాతి కథ ఆయన మాటల్లోనే తెలుసుకుందాం—

"23 జూన్ నాడు నేను పాట్నానుంచి ఢిల్లీ వెళ్ళాను. అక్కడే 26 ఉదయం దాదాపు మూడుగంటల వేళ 'గాంధీ ప్రతిష్టాన్'లో నా విడిదిలో అరెస్టు చేయబడ్డాను. ఢిల్లీనుంచి హరియానాలోని సొహనా ప్రదేశానికి నన్ను కారులో తీసు కెళ్ళారు. అక్కడ రెస్ట్‌హౌస్‌లో వుంచారు. సొహనా చేరితేనే శ్రీ మొరార్జీ దేశాయిని అరెస్టుచేసి తీసుకురావటం నేను చూశాను. మేము అదే భవనంలో వేరు వేరు గదుల్లో వుంచబడ్డాం వారితో నా కలయిక కాలేదు-ఒకేచోట వున్నప్పటికి కూడా. కనీసం భోజన సమయంలోనైనా మమ్మి కల్సుకోనివ్వండని మా కాపలా పోలీసు అధికారిని కోరాను. ఈ అభ్యర్థననుకూడా ఆయన అంగీకరించలేదు."

రెండురోజుల తర్వాత జూలై మొదటి తేదీ ఎయిర్‌ఫోర్స్ విమానంలో చండీగఢ్ తీసుకెళ్ళారు. విడుదల దినం 12 నవంబర్ 1975 వరకు అక్కడి హాస్పిటల్ గదిలోనే బందీగా వుంచారు.

## ప్రధానికి లేఖలు

పోలీసు మిలటరీ దళాలను తిరుగబడమని జయప్రకాశ్ ప్రభుత్వ ద్రోహానికి పూనుకున్నట్లు ప్రధాని ప్రసంగాల్లో ఆరోపణ వుంది. అది విని 'సత్యమేవ జయతే' సూక్తిని ఆదర్శంగా స్వీకరించిన మన ప్రభుత్వ విధానం ఇదా అనుకున్నాడు 27 జూలై 75 నాడు ప్రధానికి పెద్ద లేఖవ్రాస్తూ అందులో ఇలా ప్రశ్నించాడు- "ప్రధాని అన్నట్లుగా నా ప్రయత్నం అదే అయితే, గత ఉప ప్రధాని మొరార్జీ దేశాయి, కాంగ్రెసు కార్యసమితి సభ్యుడు చంద్రశేఖర్ కూడా అందులో భాగ స్వాములా? వారెందుకు బందీలయ్యారు?"- ఆ తర్వాత ఈ పుస్తకం 4వ పేజీలోని అంశాలున్నవి-స్వవిషయాలు తర్వాత వున్నవి.

"మీకు తెల్సు. నేను ముసలివాడనైనాను. నా జీవితకార్యం పూర్తయ్యింది. ప్రభ మరణించిన తర్వాత నేను జీవించి వుండవలసిన అవసరమేమీ లేదు. చదువు ముగించిన తర్వాత నేను నా పూర్తి జీవితాన్ని దేశానికే అర్పించాను. దానికి బదులుగా నా కోసమని ఏదీ కావాలని కోరలేదు. అందువలన మీ రాజ్యపాలనలో బందీగా నేను సంతోషంగా మరణించగలను.

చివరగా ఒక్కమాట-మీరు మిమ్మల్నే దేశమని భావించకండి. మీరు అమరులుకారు. భారతదేశం అమరం, ఒకవేళ మంత్రిత్వ స్థాయిలో అవినీతిని అంతం చేయాలనుకుంటే, ప్రతిపక్షాలను కూడా విశ్వసించి, వారి సలహాలను అంగీ కరించడానికి పూనుకుంటే, మీకు మా అందరి సహాయం లభిస్తుంది. దానికోసం మీరు ప్రజాస్వామ్యాన్నే నష్టపరచవలసిన పనిలేదు-నిర్ణయం మీది."

ఈ జె. పి. లేఖ ప్రధానికి చేరిందో లేదో తెలియదు కాని జవాబుమాత్రం రాలేదు.

మరో లేఖ తేది 27-8-75 నాడు వ్రాసారిలా.

"ప్రధానమంత్రి-న్యూఢిల్లీ.

పాట్నా బీహార్ పరిస్థితులకు నాకు చాల దుఃఖం కలిగింది. పాట్నాలో ఇంత కష్టం ఇంతకు పూర్వం ఎప్పుడూ జరగలేదనడానికి చరిత్ర సాక్షి, నేనిచ్చట నిస్సహాయంగా పడివున్నాను. ఒక్క నెల పెరోల్ మీద నన్ను విడిచిపెట్ట వల్సిందిగా మిమ్మ్మ ప్రార్థిస్తున్నాను. నేను బీహార్ మరియు ఇతర రాష్ట్రాల ప్రజలను, కేంద్ర ప్రభుత్వాన్ని కల్సి సహాయాన్ని అందించివస్తాను. ఒకవేళ ఆ అలజడి తగ్గకపోతే వేరే ప్రయత్నం చాల చేయవల్సి వుంటుంది. 1934 బీహార్ భూకంపం సందర్భంలో-బ్రిటిష్ ప్రభుత్వం రాజేంద్రప్రసాద్‌ను అలాగే విడిచిపుచ్చింది. సత్వరం ఈ విషయంపై ధ్యానముంచి నన్ను వదలిపెట్టవలసిందిగా ప్రార్థన."

జె. పి. ని వదలలేదు. స్వదేశీ ప్రభుత్వం, ప్రజా సంక్షేమంకంటె ప్రభుత్వ భద్రత ముఖ్యం మనవాళ్ళకు. అంగబలం అర్థబలం అధికారబలం సమృద్ధిగావున్న ఒక సువిశాలదేశ ప్రజాస్వామ్యానికి ఒక వృద్ధ నిస్వార్థ ప్రజా నాయకుడంటే అంత భయం!

పీడిత ప్రజల్లో తిరుగుబాటు[తప్పదు. నియంతృత్వ ప్రభుత్వాలకు పతనం తప్పలేదు, అనేది దాచినా దాగని సత్యం-

ప్రధానమంత్రి ఉత్తరాన్ని నేను తిరిగి చదివాను. ఒకరీతిగా అది టెలిఫోన్ భాషలోవుంది. రెండుసార్లు చదివితే అర్థమైన విషయం ఏమిటంటే, నేను సహాయకార్యాల వరకే పరిమితం కావాలని స్పష్టంగావుంది. ఆ మాటలతో తెలిసేదేమంటే నేను రాష్ట్ర మరియు కేంద్ర ప్రభుత్వాలకు సహకరించాలని.

నా అభిప్రాయాన్ని ఢిల్లీలో ప్రధానికి నా అభ్యర్థనపై విచారణ కాకపూర్వమే అందజేస్తే కృతజ్ఞుడను.

మీ జయప్రకాశ్ నారాయణ్."

## మూత్రపిండాలు చెడిపోయాయి

అదే విచిత్రం. అంతవరకూ వృద్ధాప్యంవల్ల, అవిరామ పరిశ్రమల వల్ల అనారోగ్యం పాలవుతున్నా ఏనాడూ మూత్రపిండాల వ్యాధిలేదు. బందీగా వున్న హాస్పిటల్‌లో డాక్టర్లయినా ఈ విషయం సూచన చేయలేదు. ఒకనాడు అకస్మాత్తుగా జయప్రకాశ్ మూత్రపిండాలు రెండూ పూర్తిగా చెడిపోయినట్లు చెప్పారు. ఇంత అకస్మాత్తుగా ఇలా ఎలా జరిగిందనేది ఆయనకూ ఎంతమాత్రం అర్థంకాలేదు. అదీ విడుదలకు కేవలం ఒకవారం ముందుగా అయిదు నవంబర్‌న తెలిపారు.

ప్రత్యేక వైద్య చికిత్సతోపాటు రక్తశుభ్రతకు కృత్రిమ మిషన్ అవసరమయింది.

## జస్లోక్ ఆస్పత్రి చికిత్స

జయప్రకాశ్‌ను ఆయన కోరికగా బొంబాయి జస్లోక్ ఆస్పత్రిలో చేర్చారు, అక్కడి డాక్టర్లు శ్రద్ధగా చికిత్స చేశారు. ఆయన కోలుకున్నా తాత్కాలికమే.



వారానికి మూడుసార్లు కృత్రిమ యంత్రంద్వారా శరీరంలోని రక్తాన్నంతా గొట్టం ద్వారా లాగి శుభ్రపరచి తిరిగి ఎక్కించాలి. అది ఏడుగంటల కార్యక్రమం. కష్టంతో కూడిన ప్రక్రియ.

అయినా ఆశవదలుకొన్న ప్రియతమ నాయకుడు జీవించ గల్గాడు. "మేం మిమ్మల్ని బ్రతికించలేదు. మీ హృదయ బలమే మిమ్ము కాపాడింది" అన్నారు డాక్టర్లు.

"సర్వేశ్వరుడే నన్నుకాపాడుకున్నాడు" అన్నాడు సర్వోదయ నాయకుడు.

ఇక ఇంతే. జీవితకాలమంతా ఇలా దవాఖానాలో పడివుండడం జె.పి.కి నచ్చలేదు. శరీరంలో ఊపిరి వున్నంతవరకు దేశంకోసం ప్రజలకోసం శ్రమించే స్వభావం శవజీవితం నచ్చదు. సుఖాసక్తి మొదటినుంచీ లేదు.

ఒక యంత్రాన్ని కొన్నిలోకనాయక్ చికిత్స ఇంటివద్దనే జరిగే సౌకర్యం కలిగించాలని మిత్రులు నిర్ణయం తీసుకున్నారు. కాని, అది మామూలుగా లభించే వస్తువుకాదు-మూడులక్షల వ్యయం, చందాలద్వారా డబ్బు సేకరించ నెంచారు.

## క్రొత్తపార్టీ అవతరణ

ఎమర్జెన్సీ కాలంలో అతివాద, మితవాద పార్టీలవాళ్ళు అనేకులు అరెస్టు చేయబడి జైళ్ళలో చిత్రహింసల పాలైనారు. అదేరాత్రి 400 వారెంట్లు వెళ్ళినయ్. 25 జూన్ 1975 రాత్రి రూపొందిన అత్యయిక పరిస్థితి 26 ఉదయం మంత్రిమండలిలో ఆమోదింపబడి పత్రికల కెక్కింది.

పదవీ భయంతో ముందు జాగ్రత్తగా ప్రధాని తీసుకున్న కఠినచర్య ప్రజాహిత కార్యక్రమాల ప్రచార రంగమైంది. ఆమె 20 సూత్రాలతోపాటు

కొడుకు సంజయ్ 4 సూత్రాలు సంస్కరణకు పూనుకున్నవి. 3+26=420 అని అపహాస్యంపాలై ఒకసూత్రం పెరిగి 5, 20గా మారినై. మొదట మేధావులు కూడా ఇది గొప్పమార్పు అని అనుకున్నారు. తర్వాత ఇదా అసలు రహస్యం అని విచారించారు.

సుదీర్ఘ కాలం సాగిన ఈ ఎమర్జెన్సీని చివరికి ఎత్తివేయక తప్పలేదు ఏడాదిన్నర కాలానికి.

11 అక్టోబర్ 1977 తన 73వ. జన్మదినోత్సవాన్ని అభిమానుల మధ్య సంతోషంగా గడుపుతున్నాడు.

దేశంలోని ఆకలి అవిద్య నిరుద్యోగం దార్రిద్ర్యం అశాంతి అలజడులకు ఆయన మనస్సు నొచ్చుకుంది. దీనికి తగినమార్పు అవసరమని భావించాడు.

## జనతా విజయం-పతనం

1977 కేంద్ర ఎన్నికలకు కేవలం రెండున్నర మాసాలకు ముందు ప్రతి పక్షాల కూడలిగా 'జనతా పార్టీ'ని జాతీయస్థాయిలో రూపొందింప జేసాడు. జె. పి. కృషి మూలంగా ఎన్నికల్లో ఘన విజయం సాధించి 90 ఏండ్ల రాజకీయ చరిత్ర గలిగి 30 ఏండ్లు పరిపాలనా పీఠంపైవున్న కాంగ్రెసు పార్టీని చిత్తుగా ఓడించింది.

ఆనాటి జనతా నాయకులు-ఆచార్య కృపాలానీ, అశోక్ మెహతా మొరార్జీదేశాయ్, జగజీవన్‌రాం, విజయలక్ష్మి పండిట్, అటల్ బిహారీ వాజ్‌పేయి,

లాల్ కృష్ణ అద్వానీ, నీలం సంజీవరెడ్డి, ప్రకాశ్ సింగ్ బాదల్, చరణ్ సింగ్, హేమవతి నందన్ బహుగుణ, రాజనారాయణ్, జార్జి ఫెర్నాండజ్, చంద్రశేఖర్, మొ॥వారు. సినీఫీల్డ్ నుంచి దేవానంద్ కూడా పాల్గొన్నాడు.



మొరార్జీ ప్రధాని అయ్యాడు. ఆంధ్రప్రదేశ్ నుంచి గెలిచిన ఒకే ఒక జనతా అభ్యర్థి సంజీవరెడ్డిగారిని రాష్ట్రపతి పదవి వరించింది. ఇది గొప్పమార్పు! మనది గొప్ప ప్రజాస్వామ్యంగా ప్రపంచ ప్రశంసలందుకున్నది. కాని, ఈ ప్రజాస్వామ్యాన్ని గూర్చి జె. పి. అభిప్రాయం.

"అమెరికాలో ఒక విద్యాసంస్థ జరిపిన పరీక్షలో నూటికి డెబ్బదిమందికి తమ రాష్ట్రపతి పేరయినా తెలవదని తేలింది. బీహారు గ్రామాల్లో కృపాలానీ ప్రశ్నలకు జనం జవాబు "జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశం రాజు, ఆయన తర్వాత కుమారుడు గద్దెపై కూర్చుంటాడు" అని.

ప్రపంచ ప్రజల పరిస్థితి ఇదీ. పైగా మనం ఓటుద్వారా ఏర్పడుతున్న మన ప్రజాస్వామ్యం బాగా నడుస్తున్నదని అంటున్నాం. పౌరులకు ఓటుహక్కు ఇస్తేనే ఆదర్శ రాజ్య వ్యవస్థ ఏర్పడిందని నాయకుల అభిప్రాయంలో వుంది." ఇంకా ఇలా అన్నాడు.

"రాజనీతియొక్క వికాసం గత శతాబ్దాల్లో ఏదైతే రూపొందిందో అది మానవ సమాజాన్ని ఏ స్థాయికి చేర్చిందో- దౌర్భాగ్యవశాన దానికి మించి మంచి మార్గంలేదని మనం భావిస్తున్నాం. నేడు ముఖ్యంగా ఎన్నికల ప్రజాస్వామ్యం ఏక పక్షపాలన నడుస్తున్నది. వాటికంటె ఉత్తమ విధానం ఏదైనావుందా, అని ఆలోచించి అటువైపు వెళ్ళటానికి ప్రయోగం జరపటానికి పూనుకోలేదింకా.

ఎన్నికలు మొదలైన రాజకీయాలకై ఎంత శక్తిని వ్యయిస్తున్నామో అందులో సగభాగమైనా ఈ నూతన మార్గాన్వేషణకై ఖర్చుపెడితే పరిస్థితి వేరుగా మారుతుంది."

నాయకులలోని మరో లోపాన్ని ఇలా పేర్కొన్నాడు.

"ఒక వ్యక్తి ప్రతిపక్షంలో వున్నంతవరకు చెడ్డవాడే మన దృష్టిలో. ఏ కారణంగానైనా అందులోంచి వేరయితే చాలు ఆతని విలువ పెరుగుతుంది. పైగా

అతన్ని మనపక్షంలో కలుపుకోవటానికి భూమి ఆకాశాలను ఒకటి చేస్తాం. మనవైపు చేరినా ఆ వ్యక్తి గంగాస్నానం చేసి పవిత్రుడై నట్లే. మంచి ఏమిటి? చెడేమిటి? అనే సంగతి ధ్యాసమాత్రం వుంటూలేదు."

ఎన్ని ఆశయాలున్నా ఎన్ని నీతులు బోధించినా జనతాప్రభుత్వం రెండేండ్లు మించి గద్దెపై నిలవలేక పోయింది. అందుకు కారణం పదవీ వ్యామోహాలు పాత పార్టీల వాసనలు అంతఃకలహాలు. జనతా ప్రభుత్వం కూలి-పార్టీ చీలి వింతగా చరణ్‌సింగ్ ప్రధాని అయ్యాడు 23 జూలై 1979 నాడు-కాంగ్రెస్ సహాయంతో.

విధిలేక ఈ క్రొత్త ప్రధానికి ఆశీస్సులిచ్చాడు. లోకనాయక్. పాలకు లెవరైనా పాలన బాగుండేచాలు అనే భావన వారిది.

ఇందిరాజాలంతో 24 రోజులకే ఆయన ప్రభుత్వం కూలింది. అయినా ఆపద్ధర్మ ప్రధానిగా ఆరుమాసాలు కొనసాగాడు. జనవరి 80, మధ్యంతర ఎన్నికల్లో తిరిగి ఇందిరా ప్రభుత్వం నెలకొని జనతా తుడిచి పెట్టుకుపోయింది.

## మనిషి మరణించినా ఆలోచనలు - ఆదర్శాలు మిగిలి ఉంటాయి

అనారోగ్యంతో. అలసిన దేహానికి, అసంతృప్తితో విసిగిన మనస్సుకు

పరిపూర్ణ విశ్రాంతి చేకూర్చటానికో అన్నట్లు జయప్రకాశ్ తన జీవయాత్ర ముగించిన రోజు 8 అక్టోబర్ 1979.

గాంధీజీ తిరిగివస్తే ఏమౌను అనడానికి సమాధానంగా 'రెండవ గాంధి'గా పేరు పొందిన జె. పి. అస్తమించాడు.



జనం విలపించారు. అవినీతి, లంచగొండితనం, నిరుద్యోగం, దారిద్ర్యం... లతో నిండిన ఈ దేశ రోగానికి ఏది తగిన ఔషధం అని ఆలోచన మిగిలింది మేధావులు నిర్లిప్తులు, సామాన్యులు అజ్ఞానులు, మధ్య తరగతివారే వివిధ భావాల మధ్య కొట్టు మిట్టాడుతున్నవాళ్ళు.

ఫలితం జనసత్తా భవిష్యత్తులపై ఆధారపడి వుంటుంది. మీరు ఎప్పుడు తప్పుడుదారినే ఎన్నుకున్నారు-అన్నవారికి జయప్రకాశ్ జవాబు ఇలాగుంది-

"నేనెప్పుడూ పదవుల గుర్రపుస్వారీకి పూనుకోలేదు. దేశానికి లేదా జనానికి మార్గదర్శిని కావాలనే కోరిక నాకెప్పుడూ లేదు. ఏ పదవినీ కోరలేదు. ఎంత పెద్ద పదవికానీ నన్ను ఆకర్షించలేదు. 1930 నుంచి ప్రత్యక్షంగా రాజకీయాల్లో వున్నా ఏనాడు కానీ ఏ పదవికి పోటీ చేయలేదు. నేను కాంగ్రెసులో వున్నప్పుడు ఎన్నికలలో ఇతరుల కోసం ప్రసంగించ వెళ్ళేవాడిని. కాంగ్రెసునుంచీ సోషలిస్టు పార్టీ వేరైనప్పుడు అభ్యర్థులకు టికెట్లు పంచే బాధ్యత పార్టీ ప్రధాన కార్యదర్శిగా నాపై వుండేది. ఇతరులను ఎన్నికల్లో నిలిపాను కాని, నేను పోటీలో నిలవాలనుకోలేదు. అది నా స్వభావం కాదు. మార్క్సిస్టుగా ఉన్నప్పుడు కాని, 1942లో అండర్ గ్రౌండ్ కార్యక్రమం నడిపినప్పుడు కానీ, ఎప్పుడూ నేను అతివాదిని కాను."

సర్వోదయ నాయకుడు వినోబాజీని గూర్చి—

వినోబాజీ అహింసా ఉద్యమ ప్రబోధకులు-మార్గదర్శకులు. ఏ విధమైన శాంతి ఉద్యమం కూడా అవసరం లేకుండానే రాజకీయ రంగంలో మార్పు సాధ్యమని వారి విశ్వాసం. ఇరువదేండ్లు సర్వోదయ సంస్థ సంబంధంతో జయప్రకాశ్ వినోబాజీ భూదాన గ్రామ స్వరాజ్య ఉద్యమం నీరస దశకు చేరుకున్నట్లు

గ్రహించాడు. తాము స్థాపించిన గ్రామ జన సంఘర్షణ సమితులు కొన్ని మాసాల్లోనే మంచి ఫలితాలు సాధించి సజీవంగా వున్నట్లు గమనించాడు—వినోబా ఆధ్యాత్మిక నైతిక భావాలు సాధు జీవితం కొందరిలో నైతిక మార్పు తెచ్చినప్పటికీ అదెప్పుడూ సామాజిక మనో వైజ్ఞానిక శక్తి కాజాలక పోయిందని ఆయన అభిప్రాయం.

జె. పి. కలలు కన్న భారతదేశం-ఒక ఆదర్శలోకం!

జనసాధన సంపత్తి యావత్తూ నిర్బలుల సేవకు అర్పితమౌతుంది. అక్కడ మానవత కేంద్రంగా వుంటుంది. అంతరాత్మ ప్రేరణ ప్రకారం పనులు చేసే అధికారం, అందుకు గౌరవం ఉంటవి. విభిన్న భావాలు శాంతియుతంగా చర్చించబడి, సభ్యరీతిలో పరిష్కరింపబడతాయి.

అక్కడ అందరికీ పని వుంటుంది. ఆ పనిద్వారా సంతోషం, సుందర జీవితం లభిస్తాయి. ప్రతి వ్యక్తికీ తన సృజనాత్మక శక్తిని వికసింపజేసుకునే అవకాశముంటుంది. కుటీర పరిశ్రమల్లోకాని, కర్మాగారాల్లోకాని యాజమాన్యానికీ, శ్రామికులకూ సంబంధమూ భాగస్వామ్యమూ వుంటాయి.

ఆ దేశంలో ప్రతి సాధనం ప్రజలకు కూడూ, గుడ్డ, గూడు మరియు నీరు వంటి అవసరాన్ని తీర్చడంలో నిమగ్నమై వుంటుంది.

ఆ దేశంలో అధికారులు, ప్రజా ప్రతినిధులు, ప్రజా సేవకులు. వారు మార్గం తప్పితే దండించే అధికారం ప్రజలకుంటుంది.

ఒక సంపూర్ణ ప్రగతిశీల గాంధీవాద స్వాతంత్ర్య సమరశీల భారతదేశాన్ని రూపొందించటం కోసం ఆయన కలలు కన్నాడు.

అందుకే జయప్రకాశ్ లోకమాన్యుడు ! ధన్యుడు ! !

★ ★ ★